ఆంతర భారతీయ పుస్తకమాల

# ఇది మన జీవితం

రచన

దిలీప్ కౌర్ తివానా

అనువాదం

వేమరాజు భానుమూర్తి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ప్రకృతికి అనుకూలంగా పునరుత్పాదితమైన
పేపరుతో ఈ పుస్తకం ముద్రించబడినది.

ISBN 81-237-1393-2

ప్రథమ ముద్రణ 1995 (శక 1917)

*Original title in Punjabi*

Eh Hamara Jeevana by Dilip Kaur Tiwana

*Telugu translation:* Idi Mana Jeevitam

రూ. 33.00

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్క్,
న్యూఢిల్లీ - 110016 ద్వారా ప్రచురింపబడినది.

# ఉపోద్ఘాతము

భాయి వీర్‌సింగ్ (1872-1957) ఆధునిక పంజాబీ సారస్వతంలో అన్ని అంశాలను స్పృశించారు. అయితే అధునాతన పంజాబీ నవల అధునిక పంజాబీ కవిత అతనికి ఎంతో ఋణపడి వున్నాయి. నవలా రచయితగా ఆయన చారిత్రక ప్రేమగాథలను ఎన్నుకొన్నారు. సుందరి, విజయ్‌సింగ్ వంటి రచనలు ఈ కోవకు చెందుతాయి. ఇంచుమించు అదే సమయంలో గత కాలపు ఇస్లాం వైభవాలను జ్ఞాపకం చేస్తూ సిక్కిజమ్ గూర్చి నజీర్ హమ్మ అబ్దుల్ హలీం షరార్ సాగించిన రచనల విధానాన్ని ఈయన అనుసరించారు. సాంఘిక సంబంధి నైతిక విలువల నవలా రచనలో ఈయన మార్గదర్శి అని చెప్పవచ్చు. వీరిని అనుసరించి రచనా వ్యాసంగం కొనసాగించన వారిలో ప్రముఖులు చరణ్ సింగ్ షాహిద్(1887-1935), అమర్ సింగ్ (లాహోర్ మోడల్ ప్రెస్ వ్యక్తి),

భాయి వీర్‌సింగ్‌ను "అధునాతన పంజాబ్ సాహిత్యంలో మహామనీషి" అని ముల్క్‌రాజ్ ఆనంద్ సరిగానే అభివర్ణించారు. పంజాబీలో భాయి వీర్‌సింగ్ రచనలు కొనసాగిస్తున్న కాలంలో విద్యావంతులైన పంజాబీలకు పాఠశాల పాఠ్యాంశాలకు ఉర్దూ ప్రముఖ భాషగా ఉండేది. 19వ శతాబ్ది ఆఖరి రోజుల్లో పంజాబులో విద్యావేత్తగా ప్రసిద్ధి చెందిన మహమ్మద్ హుస్సేన్ ఆజాద్ ఉర్దూ భాషలోకి స్కాట్, లిట్టన్, డికెన్స్, రైడర్ హగ్గర్డ్, టాల్‌స్టాయ్ వంటి వారి రచనలను అనువదించారు. అవి బహుళ ప్రచారంలో వుండేవి. ఈ రచనలన్నీ కూడా చదివివున్న భాయి వీర్‌సింగ్ సిఖ్ చరిత్రకు సంబంధించిన రచనలలో ఈ పాశ్చాత్య రచయితల విధానాలను అనుసరించారు. అయితే ఈయన పంజాబుకి చెందిన కిస్సాలు (దామెదర్, ముక్బల్, వారిస్, కదిర్యార్, హషీమ్ ) వంటివారి చేత ప్రభావితం కాలేదు. ఈ

కిస్సాలు శృంగార కవితలుగానీ లేక గురునానక్ తదితర గురువుల జనమ్‌సాఖీలు, పరోబీల నుంచి స్వీకరించబడినవి. ఇవి గురువుల జీవిత చరిత్రలను చారిత్రక కాల వ్యవధిలో సమానాంతరంగా గానం చేసినప్పటికీ కూడా వీటి ప్రభావం భాయి వీర్‌సింగ్ పై పడలేదు. భాయి వీర్‌సింగ్ నవల పుష్కలంగా ఎదిగినప్పటికీ వేళ్లూనుకోలేదు. ఈ శతాబ్ది 20వ దశాబ్దంలో చరణ్‌సింగ్ షాహీద్, మోహన్‌సింగ్ వైది, అమర్‌సింగ్ వంటి వ్యక్తులు వీరి శైలిని అనుసరించడానికి మాత్రమే ఇవి ఉపయోగించాయి.

పంజాబీ జీవితాన్ని నిజంగా ప్రతిబింబించిన మొట్ట మొదటి పంజాబీ నవలా రచయిత నానక్ సింగ్(1897-1971) అని చెప్పవచ్చు.అయితే ఈ నిజప్రతిబింబంలో పాశ్చాత్య నవలా రచయితల సహజత్వం గోచరించదు. పంజాబీ మధ్య తరగతి కుటుంబాల పట్టణ జీవితాన్ని ప్రతిబింబినా, ఈయన సాంఘిక జీవనం ఉత్తమంగా వుండి వుంటే ఈ జీవితం ఎలా వుండేదో ఊహిస్తూ రచనలో వైవిధ్యం తీసుకొచ్చేవారు. తన ప్రతి నవలలో ఒక ముఖ్య పాత్రను ఉపయోగించుకొని నైతిక విలువలు గూర్చి నానక్ చంద్ వివరిస్తూ వచ్చేవారు. దైవ భక్తి, ఒక ఉన్నత లక్ష్యం వంటివి వుండే తన నవలలోని పాత్రలు ఇంకా ఉత్తమంగా జీవించిగలిగి వుండేవని ఈయన సూచించారు. ఒక ప్రత్యేక లక్ష్యంతో నవలా రచన సాగించారు. కథావస్తువు నిరాడంబరంగా వున్నప్పటికీ ఇంద్రజాలం అభూత అంశాలతో వుండేవి. రచనలో అప్పటికప్పుడు మార్పులు చేస్తూ పోవడంలో వీరి రచనలు పాఠకులను రహదారి మీదనుంచి తుప్పలలోకి లాక్కొని వెళతాయి. ఎన్నో రచనలు చేసిన నానక్ చంద్ తన దృక్పథాన్ని, విలువలను పూర్వీకుల నుంచి సంతరించుకున్నారు. భాయి వీర్‌సింగ్ వలె నవలలను"సిఖ్ కుల విషయం" గాక పోయినప్పటికీ వీరి నవలల్లో సిక్కులు కోకొల్లలుగా కనిపిస్తారు. భాయి వీర్‌సింగ్ ను పురాతన సిఖ్ సభ ఉద్యమం కదలించినట్లు వీరిని అకాలీ ఉద్యమం కదిలించింది. వీరి నవలలో పదేపదే ఒకే కథా వస్తువు రచయిత ఎన్నుకొంటూ వచ్చినప్పటికీ అవి పంజాబీ పట్టణ జీవితంలోని వైవిధ్యం ప్రస్ఫుటం చేస్తూ వచ్చాయి. వీరి నవలలో పంజాబీ పట్టణ జీవితం బాహ్యరూపం మాత్రమే ప్రతిబింబించినప్పటికీ సాంఘిక సిద్ధాంతాలు రాజకీయ విషయాలు వీటితో పెనవేయడంతో రచయిత సమస్యను లోతుగా అర్థం చేసుకోలేదని వ్యక్తమవుతోంది. సమకాలీన కథా వస్తువును

స్వీకరించినప్పటికీ వీరి రచనలలో సమకాలీనత గోచరించదు. చిట్టాలాహూ(1936వరకు) ఫులాది ఫూల్, కాగటన్ దీ చేరి (1935 వరకు) ప్యార్ దీ దునియా, గరీబ్ దీ దునియా, జీవన్ సంగ్రామ్ (1936 నుంచి 1947 వరకు) వంటివి వీరి రచనలలో ప్రముఖమైనవి. ప్రఖ్యాత పంజాబీ వచన రచయిత గురుబక్స్ సింగ్ ప్రభావానికి లోబడి వీరు జీవిత చరమావస్థలో శృంగార భావుకుడు గా రూపొందారు. అయితే దేశవిభజన గూర్చి వీరు రాసిన నవలలో సాంఘిక రాజకీయ నిజ స్థితిని రచయిత లోతుగా అర్థం చేసుకున్నట్లు కనిపించదు.

నానక్ సింగ్ తర్వాత పంజాబీ నవలా రచయితల మరొక తరం ఉద్భవించినది-కర్తార్ సింగ్ దుగ్గల్ (1917-), సురీందర్ సింగ్ నరుల్లా(1917-), జస్వంత్ సింగ్ కన్వల్(1920-), నరేంద్రపాల్ సింగ్(1922-), మొహిందర్ సింగ్ సాధ్నా(1925-)అమృతా ప్రీతమ్(1919-). ఒక్క కన్వల్, అమృత తప్ప ఈ నవలా రచయితలందరూ ఉన్నత విద్యనభ్యసించిన వారు. అయితే వీరిద్దరూ కూడా బాగా చదువుకుని ఆధునిక నవలా విధానాలను పూర్తిగా ఆకళింపు చేసుకున్నారు. ఒక కన్వల్ తప్ప మిగతా అందరూ కూడా విద్యావంతులైన మధ్య తరగతి కుటుంబాలకు చెందిన వారు. అందువల్ల "దేవుడిచ్చిన దేదో స్వీకరించు" అన్న 19వ శతాబ్దపు పెత్తందారీ సంఘపు లక్షణాలను వీరు అంగీకరించలేక పోయారు. సంధి కాలంలోని సంఘానికి చెందిన వారు కనుక అతిత్వరగా మారుతున్న సాంఘిక పరిస్థితులకు వారు సర్దుకుపోవలసి వచ్చింది. "యల్లాహ్" (నావికుడు)సేనాపతి,బాహ్ మల్లాఝా హొషియార్(ది ట్రాప్డ్ అన్న మకుటంలో ఈ నవల ఇంగ్లీషులో ప్రచురితమైంది). వంటి నవలా రచయిత నరేంద్రపాల్ సింగ్ స్వీయాభిప్రాయానికి అతీతమైన సహజత్వాన్ని చూపించారు. శ్రద్ధగా ఆలోచించి చేసిన నరేంద్రపాల్ సింగ్ రచనలలో విక్టోరియన్ కాలం నాటి రాజీపడిపోయే ధోరణి వ్యక్తమవుతుంది. హెచ్.జి. వెల్స్, గాల్స్వర్దీ, ఆర్నాల్డ్ బెన్నెట్, వంటివారి రచనలలో ఈ ధోరణి కన్పిస్తుంది. ఇటీవలి కాలంలో వీరు స్వీయభిప్రాయాలకు అతీతంగా వుండడం, విస్మరించి తానొక అధునాతన గురువునన్న భావాన్ని పెంపొందిస్తున్నారు. రాజకీయ, సాంఘిక ఉద్ధరణ తో వీరికి ప్రమేయం లేదు. ఆంతరంగికమైన "ఘనత" పరిశీలించడానికి రచయిత కృషి చేస్తున్నారు.

అయితే జీవితంలో కర్తవ్య విమూఢత్వం చేతకానితనంగా రూపొందుతుందని వీరు విస్మరించునట్లు కనిపిస్తోంది. మొదటి రోజుల్లో వీరి నవలలో స్వీయాభిప్రాయానికి అతీతమైన సహజత్వం గోచరించేది. అయితే ఇటీవలి కాలంలో వీరు అడ్డదారి పట్టిపోయి ఊహాకాలపు భవిష్యత్తులో ప్రేదమ్ సుల్తాన్ ఖూద్ నాటి భూతకాలం లోను జీవిస్తున్నారు. మొహిందర్ సింగ్ సర్నా, సుర్జీత్ సింగ్ సేఠీ(1928-)నవలా రచనల్లో కొత్త ప్రయోగాలు చేసారు. అయితే వారి నవలలోని కథలు మారుతున్న సాంఘిక ఆర్థిక పరిస్థితులను ప్రతిబింబిచేవిగా లేవు. అందువల్ల అవి ఒక సుందర స్వప్నంగా మాత్రమే రూపొందుతూ వచ్చాయి. సర్నా రాసిన పిరన్ మల్స్ రాహ్ (దుఃఖభరిత మార్గము), కంగన్ దే కంధే,(తరంగాలు-తీరాలు),సేఠీ రాసిన ఏక్ షహర్ దీ గల్(ఒక నగరపు గాథ) కంధీ వుతాయే రుఖ్(నది ఒడ్డున చెట్టు), కల్ భీ సురజ్ నహీ చర్సేగా(రేపు కూడా సూర్యుడు ఉదయించకూడదు) వంటి రచనలు ఈ విషయాన్ని సుస్పష్టం చేస్తాయి.

డాక్టర్ దిలీప్ కౌర్ తివానా, గురుదయాల్ సింగ్ కూడా పంజాబీ ప్రాంతీయ నవలా రచనకు సూత్రధారులుగా శ్లాఘించబడ్డారు. గురుదయాల్ సింగ్ పద్ధతిని విమర్శనాత్మకమైన సహజత అని చెప్పవచ్చు. అయితే ఈ సహజతలో ఉత్తేజం లేదు. వీరి పాత్రలు జీవించే పరిసరాలపై నిరాశావాదపు మేఘాలు ముసురుకొని వుంటాయి. జీవితాన్ని యథాతథంగా చిత్రించాలన్న పట్టుదల వుండడం చేత వీరు తన పాత్రలు జీవించే సాంఘిక స్థితిని గూర్చి వ్యాఖ్యానించడం కానీ విమర్శించడం కానీ చెయ్యలేదు. పంజాబులోని మాల్వా ప్రాంతానికి చెందిన సన్నకారు రైతుల జీవితాన్ని వీరు అతి శ్రద్ధగా చిత్రిస్తారు. అయితే గ్రామ సీమలలోకి పాకుతున్న నగర సంస్కృతి కారణంగా ఈ సన్నకారు వ్యక్తులు పురోగమించవలసి వచ్చి తమ మనుగడ కోసం సర్వశక్తులా పోరాడుతారన్న గుర్తింపు రచయితకి లేదు. వీరి భాషభావం కూడా మోటుగా ఉంటాయి. కనుక ఈనాటి పఠితలకు చికాకు కలిగిస్తాయి. గుర్దయాల్ సింగ్ ప్రాంతీయ నవలలో కనిపించే ఈ లోపాలు చాలా వరకు దిలీప్కౌర్ తివానా నవలల్లో లేవని చెప్పవచ్చు. ఇంగ్లీషు నవలా రచయిత్రి జేన్ ఆస్టిన్ వలె ఈమె కూడా తన పరిమితిని గుర్తెరిగి వుండడం వల్లనూ మానవ మేధో పరిధికి అతీతమైన స్థాయిలో జ్ఞానాన్ని సాధించుకోవాలన్న ఆశ లేకపోవడం వల్లనూ బహుశః ఇది సాధ్యమయిందేమో! ఆమె రచనలలో

ప్రఖ్యాతమైన రెండు నవలలు కూడా యహ్ హమారా జీవన్, అగ్ని ప్రక్రియ ఒక ఉన్నత వర్గానికి చెందినవి. అమృత కూడా స్త్రీ యొక్క మానసిక ప్రవృత్తిని తన నవలలో చిత్రించినప్పటికీ కూడా ఆమె రచనలలో చాలా వరకు పఠితలను ఆకర్షించే లక్షణమే గోచరిస్తుంది. అంటే ఒక రకంగా ఇవి ఫార్ములా నవలలు అని చెప్పుకోవచ్చు. మొదట్లో ఆమె నవలల్లో గోచరించే సహజత్వం ఇప్పుడు కనపడదు(డాక్టర్ దేవ్, పింజర్). తివానా అప్పుడప్పుడు తన నవలల చిత్రణలో ఉత్తేజితమవుతూ వుంటారు. అయితే ఇది పాఠకుల సానుభూతిని పొందడానికి గాక స్త్రీ సహజమైన భావుకత వల్ల వచ్చిన లక్షణమిది. అయితే ఆమె రచనలలో పరిమితమైన కథావస్తువు అధికంగా ఉపయోగించే మాల్వా, పియాడీ యాసలు పఠితలకు అప్పుడప్పుడు విసుగుని కలిగిస్తాయి. విమర్శకులు మాత్రం ఈ పరిమితికి కారణమైన ఆమె జన్మ, చిన్న నాటి సంగతులు గుర్తించే వున్నారు. ముఖ్యంగా ఆమె యవ్వన ప్రాంగణంలో అడుగుపెడుతున్నప్పటి సంఘటనలు.ఆమె నవలలో ఒక ప్రాంతీయ ఆకర్షణ వున్నది. ఆమె ఎన్నుకునే ఇతివృత్తపు పరిధి మానవుని బాధల గాథలను వివరిస్తుంది. నా దృష్టిలో ఈమె మాతృస్వామ్య సంఘములో కుటుంబ వ్యవహారములపై స్త్రీకి ఆనాడు వున్న అధికారం , ఈనాడు స్త్రీ తన జీవితంలో కష్టాలను తులనాత్మకంగా పరిశీలిస్తారు. భానో (మన జీవిత సరళి) లో కథానాయకి మానసిక సంఘర్షణను ఇంకే రకంగానూ వర్ణించడం సాధ్యంకాదు. ఈ కథానాయిక జీవితం అతి సామాన్యమైనప్పటికీ (ఈమె నవలలో సాంఘిక, రాజకీయ విషయాల చర్చ వుండదు) ఈ చిన్ని లోకంలోనే శ్లేషకు, హాస్యానికి ఎంతో అవకాశం వుంది.

మాదక ద్రవ్యాలకు అలవాటు పడ్డ నారాయణ్ భానోని చేజిక్కించుకోవడంలో సఫలుడవుతాడు. చిన్ననాడే విధవ అయిన భానో తనకు ఇష్టం లేకపోయినప్పటికీ, తన భర్త జీవితకాలంలోనే అతని సోదరులతో దాంపత్యం నెరపవలసి వస్తుంది. ఎంతో మత విశ్వాసం గల భానో భర్తను పూజించి విశ్వాసపాత్రంగా వుంటున్నా కూడా ఆమె బతుకుతూ వచ్చిన పెత్తందారీ వ్యవస్థ ఆమెనొక ఆటవస్తువుగా మాత్రమే పరిగణించింది. ఇది ఆమెకు అంగీకారం కాలేదు. ఆమె అనంతృప్తి భర్తకు తెలును. కానీ సాంఘికమైన కట్టుబాట్లకు లోనై వుండడం వల్ల అతను పాపం ఏమి చేయలేకపోయాడు. ఆమె భర్త మరణించిన తర్వాత మిగతా ఆస్తిపాస్తుల

వలెనే ఈమె కూడా తమ సొత్తవుతుందని భర్త సోదరులు భావించారు.

ఈ బహుభర్తృత్వపు జీవితంలో విసిగిపోయిన భానో తన ఇష్టానుసారమే నారాయణ్‌తో జతకలవడానికి నిశ్చయించుకుంటుంది.

తన భార్య నికృష్టపు జీవితానికి సాక్షిగా మాత్రమే వుండడం తప్ప ఇంకేమీ చెయ్యలేకపోయినా భర్త సరబన్‌ను ఆమె మర్చిపోలేకపోయింది. అతనికి భార్య పట్ల సానుభూతి వుండేది. ఇంటి పనుల్లో సహాయపడడం, చిన్నచిన్న కానుకలు ఇవ్వడం వంటివి చేస్తూ వుండేవాడు. అతను మరణించిన తరువాత నారాయణ్‌తో వెళ్లిపోయినప్పటికీ కూడా భానో తన పాత జీవితాన్ని విస్మరించ లేకపోతుంది. కథావస్తువు పరిమితి పాఠకులకు కొట్టవచ్చినట్లు కనిపించి డా॥తివానా కోరుకుని ఈ పరిమితి విధించుకున్నట్లు తెలుస్తుంది. లేకపోతే ఆమె కథానికల దృష్ట్యా చూస్తే, ఆమె ఇంతకన్నా పెద్ద కథావస్తువునే ఎన్నుకుని వుండేవారు. ఒక నిర్ణీతమైన సాంఘిక స్థితిలో ఒక నిర్ణీతమైన సమయంలో ఏదో ఒక పురుషుడినో స్త్రీనో చూపించడం అన్న లక్ష్యం కాదు. మానసిక ఉద్విగ్నత మత సంబంధమైన ఆకాంక్షలు (భానో కి గురుద్వారాల పై గల విశ్వాసం), ఉద్వేగమైన ప్రేమ (సరబన్ తో తన జీవితాన్ని భానీ గుర్తు చేసుకున్న కథనం)తన చుట్టూవున్న వ్యక్తుల దురాశ వారి బాహ్యరూపం క్రింద ప్రచ్ఛన్నంగా వున్న పాశవిక స్వభావం పట్ల భానో ద్వేషం ఇవీ ఆమె కథావస్తువులకు ఆధారం.ప్రస్తుతపు పంజాబులోని మాల్వా ప్రాంతపు గృహ జీవితాన్ని ఆమె చిత్రించారు. ఆమె రెండు నవలలు కూడా దక్షిణాది శిల్పకారులు చందనం మీద మలిచిన లఘుచిత్రాల వంటివి. ఇంతకు పూర్వం చెప్పినట్లు ఈ పరిమితిని డా॥తివానా కోరుకుని నిర్దేశించుకున్నారు. తనకు పూర్తిగా తెలిసిన విషయం మాత్రమే మాల్వా గ్రామం లోని కుటుంబ జీవితం గూర్చి రాయాలని ఆమె నిశ్చయించుకోవడం హేతుబద్ధకమే. జీవిత ప్రారంభ కాలంలో గ్రామసీమలో సంబంధం వున్నందువల్ల ఆమె ఈ రకమైన నిర్ణయం తీసుకోవడం సహజమే మరి. జీవితంలో చేదు అనుభవాలు ప్రతి అవమానాన్ని మనసుకు పట్టించుకునే సున్నితత్వం గల ఒక మంచి వ్యక్తి ఆమెకు ప్రమాణభూతం. తన చిన్ననాటి గ్రామీణ జీవితంలో బాధ పడుతున్న ఇరుగు పొరుగు వ్యక్తులు ఈ భామినికి రూపకల్పన. 'యహ్ హమారా జీవన్' అన్నది విషాదాంతమైన నవల. దుఃఖభూయిష్టమైన భానో జీవితగాథ యిది. నారాయణ్ రెండో పెళ్లి చేసుకొని భాగవంతి వల్ల కొడుకుని పొందడం అతని

భవిష్యత్తుకు శుభసూచన అయినా కూడా భానో తనను విడిచి వెళ్ళిపోవడం అతనికి ఏమాత్రం సంతోషం కలిగించలేదు. ఈ నవల చదువుతుంటే కోలెరిడ్జ్ రచించిన "ఏన్‌షియంట్ మార్నర్" లోని కష్టాలు జ్ఞాపకం వస్తాయి. హార్డీ రచించిన దు:ఖాంత నవలల వలెనే డా॥తివానా నవలలు కూడా మానవుని దుష్టత్వం భాధలు మన ముందుకు తెస్తాయి. ఒక్క వ్యక్తి యొక్క జీవితం వివిధ అనేక శక్తులపై ఆధారపడి వుంటుదని, ఆ వ్యక్తికి శక్తులపై ఏ రకమైన అధికారం వుండదని డా॥తివానా అతి చక్కగా తన నవలలో నిరూపించారు.చిన్న పొరపాట్లకు అనూహ్యమైన పెద్ద ఫలితాలను భానో ఎదుర్కోనవలసి వస్తుంది అని చూపించారు. నవలలోని పాత్రలలో అమాయకులు, దుష్టులు కూడా ఈ శక్తులకు ఈ చిన్నచిన్న పొరపాట్లకు లోనయ్యారు. అయితే పరిస్థితుల ప్రాబల్యానికి విధి ఆఘాతానికి వీరి ప్రతిచర్యలు మాత్రం విభిన్నంగా వుంటూ వచ్చాయి. డా॥తివానా తన రచనలో భానో భాధలకు తగిన సాంఘిక కారణం చూపించలేదు. ఈ కథ మొత్తమంతా గంగాతీరంలో భానో, నారాయణ్ అనుకోకుండా కలియడం మీద ఆధారపడి వున్నది. అయితే తగిన సాంఘిక కారణాలు లేకపోవడమన్నదే భానో కథలోని విషాదానికి మూలకందం. మానవ పరిస్థితుల సంక్లిష్టతను ఈ నవల చక్కగా అభివర్ణించింది. ఈ సంక్లిష్టతలో పడ్డ వ్యక్తుల భావాలను డా॥ తివానా ఎంతో మానవీయతతోను కరుణతోను చిత్రించారు.భానీ జీవితం భయంకరమైన ద్వేష భూయిష్టమైనది.అయితే ఈ భూమ్మీద అణచివేయబడ్డ స్త్రీ పురుషులకు సహజంగా ఎదురయ్యే జీవితమిది. పంజాబీ నవలలో సర్వత్తుగా కనిపించే పద్ధతిలో మానవ గౌరవ సంబధిత ఘటనను ఈ నవల స్పృశిస్తుంది. భానో జీవితంలో తరుచుగా పరాజయం పొందుతూ వచ్చింది. అయితే కుంగి పోలేదు. ఆమె చుట్టూ వున్న వ్యక్తులు ఉదాసీనులు.భానో తన చేతుల్లో కీలుబొమ్మ అన్నట్లు అదృష్ట ఆమెకై కష్టాలను చేర్చిపెట్టింది. అయితే ఆమె ఎంతో ధైర్యంగా వాటిని ఎదుర్కొంది. నారాయణ్ తనను ఉపయోగించుకొని విడిచి పెట్టిన తరువాత అతను రెండో పెళ్ళి చేసుకోగా భానో ఆ యింటి నుంచి వెళ్లిపోతూ తన వస్తువులన్నీ అక్కడే విడిచిపెట్టి వెళ్ళిపోయింది.అదృష్టం తనపై కరుణించదని పరిస్థితులను ఎలా వస్తే అలా ఎదుర్కోవడమే తప్ప తనకు సహాయ భూతమయ్యేదింకేమీ లేదని భానోకి తెలుసు. గ్రీకు విషాధ గాధలలో వలెనే ఈ నవలలో కూడా ముఖ్యపాత్రలు

కొన్ని వుంటాయి. నారాయణ్, భానో ఇందులోని ముఖ్య పాత్రలు. వీరుగాక నవల్లో ఇంకా అనేక పాత్రలున్నాయి.బాబేశాంతి, దయాలో, జాగర్, బంట ఇంకా ఎందరో. కథా కథనం సంక్లిష్టమైనప్పటికీ అంశం మాత్రం చాలా నిరాడంబరమైనది కావడం 'యహ్ హమారా జీవన్' లో ప్రత్యేకత. విపరీతమైన నాటకీయతకానీ, అనవసరమైన మలుపులు కానీ, సహజత్వానికి ఊహకు వారధి కట్టే ప్రయత్నాలు కానీ, మిగతా పంజాబీ నవలల్లోని ఇతర అవలక్షణాలు గానీ ఇందులో లేవు.

డా॥తివానా ఇటీవల తన జీవిత చరిత్ర ప్రచురించారు. ఆమె నవలల వెనుక గల ఉద్వేగాన్ని విమర్శకులకు వ్యక్తపరచడానికి ఈ స్వీయచరిత్ర మామూలుగా తోడ్పడాలి. అయితే వివిధ అంశాల గుచ్ఛంగా రూపొందిన ఈ స్వీయ చరిత్ర ఆమె జీవితానికి అవిచ్ఛిన్నంగా దర్పణం పట్టడం జరగలేదు. కనుక ఆమె జీవితానికి ఆమె రచనలకు సంబంధాన్ని స్థాపించడం కష్టమవుతుంది. అయినా కూడా గ్రామములోని ఆమె అనుభవాలను బట్టి చూస్తే నవలల్లోని పరిమితిని ఆమె స్వయంగా నియమించుకున్నారని తన ఇష్టానుసారమే గ్రామీణ గృహ జీవితాన్ని పరిమిత పరచుకున్నారని అర్థమవుతోంది. ఈ రకంగా ఆమె తనకు ద్యోతకమైన అనుభవాలను పఠితల ముందు స్పష్టపరచగలిగారు.

ఆమె నవల "యహ్ హమారా జీవన్" మాల్వా గ్రామీణ జీవితపు సాంఘిక నిబంధనలకు లోబడిన వ్యంగ్య చిత్రణ. ఒక వర్గపు గదుల మధ్య సాంఘిక సంబంధాలను తొలి రెండు అధ్యాయాలు వివరించగా వర్గం లోని వ్యక్తుల సంబంధాలను మూడవ అధ్యాయం వ్యక్తపరుస్తుంది. ఆఖరి అధ్యాయంలో మాటలలోని భావాన్ని గ్రహించిన పాఠకులకు ఆత్మవంచన పరిస్థితులను తప్పుగా అర్థం చేసుకోవడం, నిజానికి ,భ్రమకు మధ్యగల అవ్యక్తత సామాన్య గ్రామీణ ప్రజల మూర్ఖత్వం తద్వారా ఎదురయ్యే కష్టాలు వ్యక్తమవుతున్నాయి. జాగర్ వంటి పాత్రలు అల్లరి లక్షణాలను ప్రకటిస్తాయి. ఇతర్లను ఇరుకున పెట్టడం వల్ల ఈపాత్రలకు అపరిమితమైన ఆనందం కలుగుతుంది.

డా॥తివానాకు అపూర్వమైన మానసిక అంతర్ముఖత వున్నది. ఇది ఫ్రాయిడ్ నుంచి, జంగ్ నుంచి, హేడ్లర్ నుంచి వచ్చినది కాదు. జీవితంలోని

చేదు అనుభవాల నుండి సంతరించుకున్నది. ఈ మానసికమైన పరిణతి వలెనే ప్రతికూలమైన వ్యక్తులను స్థలాలను సృష్టించ గలిగారు. నవలలోని ఏ ఒక్క అధ్యాయాన్ని జాగ్రత్తగా చదివినా, ముఖ్యంగా మొదటి మూడు అధ్యాయాలు, ప్రతి అధ్యాయం కూడా తరువాత అధ్యాయం లోని కథనానికి ఎంత ముఖ్యమో, ఆ కథనంలో వచ్చే వ్యక్తులను అర్థం చేసుకుందుకు ఎంత అవసరమో కథాస్రవంతికి అధ్యాయం నుంచి అధ్యాయానికి వంతెన ఎలా ఏర్పడుతుందో వ్యక్తమవుతుంది.

డా॥తివానా బాగా చదువుకున్న వ్యక్తి కావడంతో తన భావి తరాల వారినుంచి ఆమె వివిధ విషయాలు నేర్చుకున్నారు.భానోకి గల తల బిరుసుతనం ఆత్మవంచనా లక్షణం చూస్తే భాయి వీర్‌సింగ్ రచనలలోని నాయకి జ్ఞాపకం వస్తుంది. అయితే ఆమె గురుబానీ బోధించాలన్న తపన కానీ భాయి వీర్‌సింగ్ యొక్క బహువర్ణీయమైన మేధాశక్తిని కానీ ప్రదర్శించరు. మనస్తత్వపు లోలోతుల్లో ఈ రచయిత్రి సున్నితంగా విషయ వివరణ చేయగల కళాకారిణి. నానక్‌సింగ్ వలెనే ఈమెకు కూడా సాంఘిక గమనిక వున్నది. కానీ బాహ్యాడంబరత లేదు. కర్తార్ సింగ్ దుగ్గల్ నవలలో వలె ఈమె రచనలకు ఒక నిర్ణీతమైన రూపం లేదు. అయితే ఈమె శృంగార వర్ణన దుగ్గల్ రచనలను జ్ఞాపకం చేస్తుంది. అయితే ఆమె నవలలు శృంగార ప్రాధాన్యమైనవి కావు. ఆమె వివరించే శృంగారం తీరు సున్నితంగా సహజంగా హద్దులకు లోబడి వుంటుంది.

మన కాలానికి చెందిన అతి ప్రముఖ విమర్శకుడు సంత్ సింగ్ సేఖన్. ఇతను తివానా ఒక కొత్త మార్గానికి ఒరవడి దిద్దిన రచయిత్రి గానూ, పంజాబీ నవలా రచయితలలో నాలుగవ తరం వ్యక్తి గానూ అభివర్ణించారు. భాయి వీర్‌సింగ్ చేత అంకురార్పణ కావింపబడి, పసితనంలో నానక్ సింగ్ వల్ల పోషింపబడి నరుల్లా, దుగ్గల్ తదితర ఆ తరానికి చెందిన వ్యక్తులతో నవలా ప్రపంచం యవ్వనాన్ని చేరుకున్నది. వీరందరూ కూడా సాహితీ వనంలో ఎంతో ఫలసాయాన్ని సాధించి రాబోయే తరాలకి తగినన్ని విత్తనాలు నాటారు. డా॥తివానా నవలలు "యహ్ హమారా జీవన్" , "అగ్ని ప్రక్రియ"

కూడా ఈ విత్తనాల పరిపక్వ ఫలాలని చెప్పవచ్చు. తాను సంతరించుకున్న ఈ విత్తనాలు పంజాబ్ లోని మాల్వా ప్రాంతపు సుక్షేత్రంలో నాటి ఆమె ఈ ఫలాలను రూపొందించారు.

684-గురుదేవ్ నగర్ - సురీందర్ సింగ్ నరుల్లా
లూధియానా
30-5-1981

# 1

కొన్ని గుడిసెలూ కొన్ని పెంకుటిళ్ళూ ఉన్న కుగ్రామమది. ఆ ఊళ్ళో ఒక చోట పొడిగానూ మరో చోట తడిగానూ ఉండే వంకర టింకర సందులు చాలా ఉన్నాయి. అందులో ఒక సందు చివర ఉన్న పెద్ద భవంతి నారాయణ్ అమ్మిది.

భానో ఇంట్లో పాచిపని చేస్తూ ఉంది.

"ఒసే! విన్నావుటే? సంతి! నారాయణ్ అమ్మి మొన్న గంగా స్నానానికి వెళ్ళినపుడు, అక్కడ ఎక్కడ నుంచో ఎవత్తెనో వెంట తీసుకొచ్చాడట" దయాలో నెత్తి మీద పేడతట్ట సవరించుకుంటూ సంతి ఇంటి గుమ్మం ముందు నిలబడి ఈ మాట అంది.

"ఆ !విన్నాను. గంగామాత అందరి కోరికల్నీ తీరుస్తుంది," అంది సంతి, మాల పాలేరుకి మజ్జిగ పోస్తూ.

"ఆ దిక్కుమాలింది అందమైనది. అసలు సిసలైన ఆడది. ఎవరి కొంప తగలపెట్టి వచ్చిందో" కొడుకుని బళ్ళోకి పంపడం కోసం తలదువ్వుతున్న బచని అంది.

"నేను అటువస్తూ కొంచెం గోడమీద నుంచి తొంగి చూశాను. ఆ వయ్యారి తిప్పుకుంటూ తిమ్ముకుంటూ ఏదో పని చేస్తూ ఉంది, సొంత అత్తారింట్లో మాదిరిగా!" అంది దయాలో కనుబొమ్మలు ఎగరేస్తూ.

"అమ్మా జుట్టు పీకకు," అన్నాడు ఆ పిల్లాడు బాధగా.

"అదేం లేదురా క్షణంలో తలంతా చెరుపుకుని తిరుగుతావు మరి."

"ఒసే బచని మనకేం తెలుసు, ఎక్కడ ఏ విషం మింగాల్సి వచ్చిందో? లేకపోతే చేతులార కొంప ఎవరు కూల్చుకుంటారు." అంది సంతి, చేతులో ఉన్న మొక్కజొన్న పిండి రొట్టెని తుంపెతుంపాలు చేసి పక్షులకు పడేస్తూ.

"పోనీయమ్మా ఈ రోజుల్లో బుద్ధి చెడిపోవడం ఎంతసేపు? బట్టలు నేసే ఉత్తముడి కూతురు సంగతే చూడు. పుట్టిల్లు వదిలేసింది. మళ్ళీ ఏ మొహం పెట్టుకుని తిరిగి వస్తుంది?" అంది దయాలో మాటిమాటికి కవ్విస్తూ రొద చేస్తున్న కందెరీగను చెప్పుతో అదలిస్తూ.

గరిటె చేతిలో పట్టుకుని వస్తున్న భానోకేసి అందరూ అదోలా చూశారు.

"అమ్మా నిప్పుందా?" అని అడిగింది భానో, సంతి ఇంటి వసారాలో గోడ దగ్గర ఉన్న పొయ్యికేసి చూస్తూ.

"ఓ దానికేం భాగ్యం బోలెడంత ఉంది," అంటూ సంతి భానో చేతిలో గరిటె పుచ్చుకుంది.

దయాలో వెనుదిరిగి ఓరచూపు చూనస్తూ బుట్ట పారేయడానికి బయలుదేరింది.బచని పిల్లాడి తల దువ్వడం పూర్తి చేసి పేలేమైన రాలాయేమో అని దువ్వెన కేసి చూడసాగింది.

నిప్పు తీసుకుని భానో వెళ్ళిపోయింది.

"చూశావామ్మా?, నారాయణ్ కోడలు పాత బట్టలే కట్టుకుంది", బచని దువ్వెన మీద పేలు కుక్కుతూ అంది.

"అమ్మా బచని రాముడి సాక్షిగా చూడటానికి వట్టి గంగిగోవులా ఉంటుంది."

"అలాంటి వాళ్ళ సంగతి నీకేం తెలియదమ్మా అనేక మంది కన్నుగప్పి వస్తూ ఉంటారు.గంగిగోవులాంటిది కాకపోతే అమలిక్ వెంట ఎందుకు వస్తుంది? దాని చేత్తో రేగివండు ఇచ్చినా తినబుద్ధి కాదు. ఎంత నిక్రుష్టమైనది!"

"అసలు ఈ వయస్సులో ఆడవాళ్ళు అలా వూరికే బరి తెగించిరారు. అనుభవం లేనివాళ్ళ సంగతి వేరు. కోడె వయస్సులో కాలు జారడం సహజం. కాని ఇక్కడ ఇప్పుడు వయస్సు అనుభవం ఉన్న సందర్భం. ఇరవై ఎనిమిది లేక ముప్పై దరిదాపు ఉండవచ్చు."

"పోనీయమ్మా! ఏమైతే మనకెందుకు. ఇంతకీ నారాయణ్ అమలికి అద్రుష్టం పండింది. రెండుపూట్ల చేతులు కాల్చుకునేవాడు. ఇప్పుడు చక్కని భోజనం అమరుతుంది. వయస్సులో ఉన్నప్పుడు ఐదువందలు ఓలిచ్చి పెండ్లి చేసుకున్నాట్ట."

"అయితే అప్పుడు ఒకసారి మోసపోయాడు. అది రెండు నెలలు కూడ ఉండలేదు. అది చాల నెరజాణ అనేవాడు.డబ్బు కాజేసి పుట్టింటి వాళ్ళు ఎవరి దగ్గరికైన పంపుతుండేవారు. అది రెండు నెలలు ఉన్నట్టే ఉండి పారిపోయి వచ్చేది. మళ్ళీ ఇంకోడి దగ్గర డబ్బు పుచ్చుకొని ఇంకోడి దగ్గరికి పంపించే వాడు. అక్కడా అదే తంతు. వాళ్ళ వ్యాపారమే అది."

"కొందరు దురదృష్టవంతులకి తల్లితండ్రులే శత్రువులవుతారు. అమ్మా నంతి ఏం చెప్పమంటావు అప్పుడు నేను పుట్టింట్లో దూది ఏకుతున్నాను.కొత్త ఊరు నుంచి మంగలి ఒకడు అటువైపు వచ్చాడు. దోవలో నుయ్యిచూచి నీళ్ళు తాగటానికి ఆగాడు. వాడో పెళ్ళిళ్ళ పేరయ్య. నాకేసి చూస్తూనే అన్నాడు, "ఔరా ఇలాంటి పిల్లకయితే రెండువేలయినా పలుకుతాయి. కాని దీనికైతే ఐదువందలు కూడ ఇవ్వరు." మా అమ్మ అంతా వింటోంది. ఒళ్ళుమండిపోయి అంది. "మహారాజా మా అమ్మాయికేసి వేలెత్తి చూపకు తిండి గడవని రోజుల్లో కూడా ఆడపిల్లలకి పుణ్యానికి పెళ్ళి చేసే వాళ్ళం. ఇప్పుడు దేవుడి దయవల్ల మాకేం కొరత లేదు."

"అమ్మాదొరసాని నువ్వు చెప్పినదంతా మంచిదే. నేను ఉన్న మాటే అన్నాను."

"అమ్మా దీన్ని బట్టే వాళ్ళ వంశగౌరవం ఏమిటో తెలుస్తుంది." సంతి చల్లిన ఈ దూగరను ఏరుకోవడానికి ఎన్ని పక్షులో చేరాయి. బచని గొప్పింటి పిల్లలాగ ముసుగు ముందుకు లాగి పమిటను సరిచేసుకుంది. పక్షులన్నీ భయపడి ఎగిరి గోడ ఎక్కాయి. ఆవిడ అక్కడ నుంచి వెళ్ళిన తరువాత మళ్ళీ గోడ దిగి నేల కెక్కరించటం మొదలెట్టాయి. పని పూర్తి చేసుకుని సంతి మట్టిగోడ మీద నుంచి భానో ఇంటివైపు చూసింది.ఇంతలో ఏమనుకుందో ఏమో తటపటాయిస్తూనే దానింటికి వెళ్ళింది. భానో గిన్నెలు కడుక్కుంటోంది.

"కోడలా! వస్తూనే పనిలో పడిపోయావు.ఒకటి రెండు రోజులు వూరుకోవచ్చుకదా."

"ఇంతలో ఏమయిపోయిందమ్మా! ఇల్లాంతా గలీజుగా ఉంది." భానో దొడ్లోంచి తొంగిచూస్తూ అంది.

"కోడలా ఇల్లాలుంటేనే ఇల్లు. పాపం నారాయణ్‌కి ఎవరున్నారు, ఇంటి

నంగతి చూనుకునేవాళ్ళు? ఈ నిర్భాగ్యుడి తల్లి పాపం చిన్నప్పుడే చచ్చిపోయింది. కర్తారి అని ఓ తోబుట్టు వుంది. అదెక్కడో ఉత్తరప్రదేశ్ లో ఉంటోందిట. ఉత్తరప్రదేశ్ లో గొడ్లు మేపుకునే వాళ్ళుంటూంటే తూర్పు జిల్లాలో ఎక్కడో ఉంటోందిట. తండ్రి పోయినప్పటి నుంచి వీడి ఆలనా పాలనా చూసేవాళ్ళు ఎవ్వరూ లేకపోయారు. చెడ్డ సావాసాలు పట్టి దురలవాట్లకు లోనై పూర్తిగా చెడి పోయాడు. ఉన్న కొంద్ర కాస్త తాకట్లలో తగలేసాడు. ఇప్పుడు కొంచెం ధాన్యం ధర పెరిగింది. ఉన్న డబ్బంతా పెట్టి కొన్ని సెంట్ల భూమి వదలిపించుకున్నాడు. లేకపోతే వాడిపని మరీ అధ్వాన్నంగా ఉండేది.ఈ రోజుల్లో అంతా బాగా తెలివి మీరిపోయారు. ముందు చూపు చూసి మరీ సంబంధాలు కలుపుతారు. ఇలాంటి అమ్మిరమ్మిల దగ్గరకి ఎవ్వళ్ళు రారు."

"కూర్చో తల్లీ," అంది భానో పీటవాలుస్తూ.

"వెళతాను, ఇంకా బోలెడంత పనుంది. రొట్టెలు పట్టుకెళ్ళి ఇవ్వాలి కూడాను. నారాయణుని భార్య ఏం చేస్తుందో చూద్దామని! ఇలా వచ్చాను. దేవుడు చల్లగా చూస్తే, నీ పుట్టిల్లేది?"

"మా పుట్టిల్లు ఛడికేకోట్లా", అంది భానో బూడిద చేతులు కడుగుకుంటూ.

"అంటే పెద్ద బస్తీ నుంచి వచ్చిన పిల్లే. నువ్వు పొద్దున నిప్పు అడగటానికి వచ్చినపుడే తెలుసుకున్నాను. ఈ పిల్ల అలాంటి ఇలాంటి పల్లెటూరుది కాదని."

"బస్తీలో నాకెవరున్నారని ! ఒక అన్న ఉండేవాడు. వాడిని కూడ దేవుడు తీసుకుని పోయాడు," అంది భానో గుడ్ల నీరు కుక్కుకుంటూ.

"అలాగా? పాపం చాలా అన్యాయమే జరిగిందే, ఇంతకీ వాడికి ఏమయిందట?"

"అవడానికి ఏముందమ్మా వుత్తి దురదృష్టం కాని! జరగ్ తిరణాలలో తోటివాళ్ళతో కలసి కడుపు నిండా తాగాడు నాటు సారా. బాగా వేడి చేసింది.కడుపులో గుడగుడలాడింది. కొద్దిగా జ్వరం వచ్చింది. ఏటికేడాది మడమలు అరిగేటట్లు తిరుగుతునే ఉన్నాడు."

"అయితే మీరు వాణ్ణి లూధియానా తీసుకెళ్ళలేదా? అక్కడ పేరు

మోసిన ఇంగ్లీషు డాక్టరు ఒకడున్నాడట. ఆయనకు చూపించలేదా? డబ్బయితే బాగానే గుంజుతాడు కాని మంచి మందేసి రోగం తక్కువన కుదురుస్తాడు."

"చూపించానమ్మ. కానీ విరిగిన అదృష్టాన్ని ఎవరు అతుకుతారు! వ్యవసాయం వదలుకోవలసి వచ్చింది. పాలికాపు ఏమి ఇస్తాడు.ఇల్లంతా గుల్లచేసి ఆ మాయదారి రోగం మొహాన పెట్టాం. అబ్బ అలాంటి అవస్థ పగవాడికయినా వద్దు, భగవంతుడా."

"అవునే తల్లి ఉన్నప్పుడంతా చుట్టాలే. కష్టాలు వచ్చినపుడు ఎవరు పలకరిస్తారు."

"వ్యాజ్యాలు వ్యాధులు ఎవ్వరికి రాకూడదంటారు. వీళ్ళ జబ్బు కాదు కాని చిల్లిగవ్వలు కూడ ఖర్చుపెట్టేశాము. మొదటేమో గేదెలను అమ్మేశాము. ఆ తరువాత ఎద్దులను అమ్మేశాము. అమ్మినా పొలం వేలం వేయడానికి కోర్టు డిక్రీ పట్టుకొచ్చిన నాడు మాబాబు పచ్చి మంచినీళ్ళయినా గొంతులో పోసుకోకుండా తిన్నగా లోపలికి వెళ్ళి ముసుగుతన్ని పడుకున్నాడు."

"నిజమే భానో రైతుకి భూమే కదా ప్రాణం."

"అయితే అమ్మా పిల్లాడిని ఢిల్లీ తీసుకెళ్ళమని ఎవరో చెప్పారు. చేతిలో చిల్లిగవ్వ లేదు. తెలిసిన వాళ్ళందరి దగ్గర ఇది వరకే అప్పుచేశాము.నిస్సహాయ స్థితిలో మా బాబు నా పెళ్ళి వాయిదా వేశాడు. ఏదో విధంగా పిల్లాడు బ్రతికి బయట పడితే చాలనుకున్నాడు. అయినా వాడేం బ్రతుకుతాడు అప్పటికే వాడికి వచ్చే ప్రాణం పోయే ప్రాణం గా ఉంది. అవసానం దాపురించింది." గుడ్డ పరచి దాని మీద కత్తిపీటతో ఆకుకూర తరుగుతూ అంది భానో.

"ఇంతకీ నారాయణ్ ఎంత డబ్బిచ్చాట్ట?" సంతి ఆవకూర బాగుచేసి భానోకి అందిస్తూ అంది.

"ఇప్పుడు నేను మోరా వాళ్ళ సంగతి కదూ చెప్పుతున్నాను. నాకు ముందు వాళ్ళతో సంబంధం కుదిరింది."

"అలాగా?"

"వాడి పేరు సరబన్. ఏం చెప్పమంటావు. వాడిలాంటి వాడు ఇంకోడు పుట్టడు పెరగడు" అంది భానో నిట్టూరుస్తూ.

"అప్పుడేమయింది? నేను మొదటే చెప్పానుగా ఇది అలాంటిలాంటి

ఆడది కాదని. ఇలాంటి వాళ్ళ కట్టుబొట్టు, భోజనం భాజనం అన్ని విశిష్టంగానే ఉంటాయి."

"వాళ్ళు అయిదుగురు అన్నదమ్ములు. వాళ్ళల్లో వీడొక్కడికే పెళ్ళయింది. వాళ్ళంతా స్థంభాల్లా నిలబడి వేళాపాళా లేకుండా గుడ్లప్పగించి తొంగితొంగి చూస్తుండే వాళ్ళు."

" ఔరా ఎంత విచిత్రం! నిజమే. ఆడజాతికే అన్ని అనర్థాలునూ. ఏమోనమ్మ తెలీదుకాని సీతాదేవి శాపంతో పుట్టినట్లున్నాను! మనకు కంటపడని ఇల్లు ఏదైనా ఉంటే అదే బాగుందనుకోవాలి." పిల్లలు పీక్కుతింటున్న ఆడకుక్కని అదిలిస్తూ అంది సంతి.

"నేను సరబన్‌కు చెప్పాను. నువ్వు వాణ్ణి మెచ్చుకుంటావు.వాడు నన్ను తీసికెళ్ళి వేరింటి కాపురం పెట్టాడు. ఒక ఏడాది పాటు ఏమి సుఖంగా ఉన్నామో.అక్కడ వాళ్ళు పళ్ళు పటపటా కొరుక్కునే వారు.నేను వాళ్ళను చెప్పుచ్చుకుని కొట్టేదాన్ని." భానో బాగు చేస్తున్న కూరలోంచి ఓ కాడతుంప విసిరివేస్తూ అంది.

"ఓ రోజున నీళ్ళ విషయమై పెద్ద తగాదా వచ్చింది. ఆ చచ్చినాళ్ళ మనుష్యులో ఏముందో గాని అతి సున్నితమైన చోట దెబ్బకొట్టారు. హఠాత్తుగా ఏమి తగిలిందో ఆ దేవుడికే తెలియాలి. దాంతో దేశమంతా గాలించటం ప్రారంభించాము. ఎక్కడెక్కడి వైద్యుల చుట్టూ, డాక్టర్ల చుట్టూ తిరిగాము, తిరిగాం. కాని ఏం లాభం లేకపోయింది. పదోరోజు సాయంత్రానికి చివరికి స్పృహ తప్పిపోయింది.అంతే ఆ రాత్రే వెళ్ళిపోయాడు." చెపుతుంటే భానో కళ్ళ వెంట నీరు బొటబొట రాలాయి.

"ఏడవకమ్మా ఏడవకు. ఇంతకీ దేవుడి దయ అలా ఉంది. ఎవరేం చెయ్యగలరు.ఏం చెప్పనమ్మా చాకులాంటి బిడ్డని దిగమింగి కూర్చున్నాను. పంధొమ్మిదేళ్ళ వాడు.చందమామ లాంటి వాడు. నాలుగు రోజుల జ్వరం కాసింది.అంతే నాలుగో నాడు మాయమయి పోయాడు. ఎవరికే విధంగా ఎప్పుడు రాసి పెట్టుందో. వస్తూంటారు, పోతుంటారు. అదేం అంత పెద్ద విషయం కాదు. మళ్ళీ ఎవళ్ళకి వాళ్ళు ఎప్పటిలాగే ఎవళ్ళ పనులు చేసుకుంటారు. బతికున్నప్పుడు ఏమి వదులు కోలేరు.ఋణం తీరిపోగానే అన్ని వదిలేసి చక్కాపోతుంటారు." సంతి సమిట కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ అంది.

"ఎంతో మంది అన్నారు-వాళ్ళ సోదరులు చాలా మంది ఉన్నారు కదా. వాళ్ళలో ఎవడో ఒకడిని మళ్ళీ కట్టుకోమన్నారు. ఆలోచించాను. ఇక్కడున్నట్టయితే కళ్ళముందు చితిమంటలు ఎప్పుడు మెదులుతుంటాయనే అనిపించింది. ఏమి చెప్పమంటావమ్మా.సర్బన్ మరచి పోవలసిన మనిషి కాడు. వాడి కోసం పశుపక్ష్యాదులు కూడ విలపిస్తుంటాయి. ఎన్నిసార్లో అనిపించేది పాపిష్టిదాన్ని నామూలాన్నే వాడి ప్రాణం పోయిందేమోనని. నేను లేనట్టయితే అన్నదమ్ముల మధ్య తగువు వచ్చేదే కాదు.వాడి ప్రాణం పోయేది కాదేమో అనిపిస్తూండేది." కూర తరుగుతూ ఉంటే పరధ్యానంగా కోసుకుపోయిన వేలిని రెండో చేత్తో ఒత్తుతూ అంది భానో.

"కత్తిపీట కోసుకుందా? మంచి పదును మీద వుంది కాబోలు!"

"అంత పదునుగా లేదే అయినా ఎలా కోసుకు పోయిందబ్బా."

"సరే నీ మనస్సు కష్టపెట్టుకోకు భానో. ఏదల్లా జరగాలో అలా జరుగుతునే ఉంటుంది. గీతని మార్చగలిగే వారెవరు? దేముడెప్పుడు నింద తన మీద వేసుకోడు. మనం అందరం భ్రమలో పడుతూ ఉంటాము."

"అయితే అమ్మా నేను అనుకున్నాను కదా. ఈ ఊళ్ళో ఇంక మనకేముంది, ఎవరున్నారు ఆయనే లేనప్పుడు. వాళ్ళ అన్నదమ్ములు అన్నారు కదా మా ఇంటి పరువు వీధిన పడనీయమన్నారు."

"అదిగో నారాయణ్ వస్తున్నట్లున్నాడు.సరేనా అమ్మా అయితే వస్తాను! ఏ వేళప్పుడు ఏ అవసరమొచ్చినా ఏం కావాలన్నా అడుగుతూ ఉండు. పొరుగునే ఉన్నాను కదా.గోడవతలి నుంచి కేకేసన్నా అడుగు." ఆ మాట అంటూనే సంతి గడప దాటింది.అక్కడే అప్పుడే నారాయణ్ కలిశాడు.

"వదినా బాగున్నావా, అప్పుడే వెళ్ళి పోతున్నావా," అన్నాడు నారాయణ్ పాదాభివందనం చేస్తూ.

"సుఖంగా ఉండునాయనా. మీ ఆవిడను చూద్దామని వచ్చాను."

"పిల్ల నచ్చిందా?"

"పాపం మంచిదే."

"మంచో చెడ్డో అంతా గంగామాత ప్రసాదం."

"ఒట్టేసి చెప్పు నువ్వు ఎవ్వరికి దేనికి దమ్మిడీ ఇవ్వలేదుకదా?"

"మంచో చెడ్డో అంతా గంగామాత ప్రసాదం."

"ఒట్టేసి చెప్పు నువ్వు ఎవ్వరికి దేనికి దమ్మిడీ ఇవ్వలేదుకదా?"

"గోవు తోడు నిజంగానే గంగామాత అనుగ్రహించింది."

"అయితే మేలే అయింది. జాగ్రత్త గా చూసుకో. మొదటిలా కాకూడదు. ఎలాగోలాగ కొంప నిలబడింది."

"అయితే వదినా నాకు వెనుకటిదంత బాగా నచ్చలేదు."

"అప్పుడు దాని సంగతి పట్టించుకోలేదు, అది ఎక్కడుందో తెలిసినా కూడ."

"నీకు తెలుసు కదా వదినా గంగిగోవు అయినా తాడేసికట్టందే ఉండదు.'"

"ఇంకేం చెప్పను నీకు. ఈ పిల్ల నచ్చింది కదా."

"అందుకని వెంటబెట్టుకుని వచ్చాను. వయస్సు చెల్లిపోయినాకూడా సంకోచించకుండా."

"దానిదేముంది. మోడైనా మళ్ళీ చిగురిస్తుంది. దానికి సమయా సమాయాలతో పని ఏమిటి."

"ఈవేళ నీళ్ళు తోడుతున్నారా?" అంటూ నారాయణ్ మాట మార్చాడు.

"దమ్ము చేయడానికి వెళ్ళాడు."

## 2

మెల్లిమెల్లిగా దీపం ఆరిపోయింది

చలి గజగజ వణికించే శీతాకాలములో చీకట్లు చిందించే కాళరాత్రి.

కీచురాళ్ళు రొదచేస్తున్నాయి.

చీకట్లో అటూఇటూ పరిగెత్తుతున్న ఎలుకలకు అడ్డువచ్చిన గిన్నెలు గణగణ మ్రోగుతున్నాయి.

ఒక వైపున కట్టేసిన గేదెల కళ్ళు రెండూ మిలమిల మెరుస్తున్నాయి.

భానోకు పై కప్పు విరిగి మీద పడుతున్నట్లు అనిపించింది.

పక్కనే ఉన్న నారాయణుని చెయ్యెట్టుకుని గుంజి పలకరించింది "అప్పుడే నిద్ర పోయారా?"

"లేదు ఏమిటి విశేషం?"

"చెప్పడానికి ఏమి లేదు. చీకట్లో భయం భయంగా ఉంది."

"మనుషులు మసలే ఇంట్లో భయం ఎందుకు? పడుకో!"

"మొదట్లో నాకూ భయం వేసేది. కాని..." భానో ఏదో చెప్పబోయి ఆగింది.

"భానో ఒకమాట అడగనా?" నారాయణ్ మొహం మీద ముసుగు తీసి అడిగాడు.

"మీరు నన్ను భానో అని పిలుస్తూ ఉండండి."

"ఎందుకు."

"ఎందుకేమిటి అందుకే వూరికేనే!" భానో బొంత మరింత బిగదీసి కప్పుకుంటూ అంది.

"సరబన్‌ను నిన్ను భాన్ అనేవాడు కదా?"

"అవును."

"అయితే నేను పిలవకూడదా?"

"ఆ కబుర్లన్నీ ఆయనతోనే పోనీయండి."

"అనేకసార్లు నువ్వు నా కంటికి దెయ్యంలా కనపడతూ ఉంటావు. దెయ్యంలాగా నాక్కావాలసిన పనులన్నీ చేసేస్తూ ఉంటావు. కానీ చేతుల్లోకి తీసుకున్నప్పుడు మాత్రం అంతా శూన్యంలా అనిపిస్తుంది. అప్పుడు నువ్వు ఎక్కడికి పోయావో అనిపిస్తుంది."

భానో ఏమి మాట్లాడలేదు.

"భానో కొత్త బట్టలున్నాయే అవి కట్టుకో. పెట్టెలో దాస్తావెందుకు?"

"ఇప్పుడు నేను కట్టుకున్నవి మాత్రం ఎక్కడా చిరగలేదే."

"భానో!"

"ఎందుకు!"

"నీకు ఇక్కడ సంతోషంగా ఉంది కదా?"

"చూడగా ఇక్కడ నాకు దుఃఖం మాత్రం ఏముంది."

"నేను చాలాసార్లు గమనించాను. నువ్వు రాత్రంతా మేలుకున్నట్లే ఉంటుంది.ఎప్పుడూ ఆలోచిస్తున్నట్టే అగుపిస్తావు."

"అబ్బే అదేంలేదు. నాకసలే నిద్ర తక్కువ. మునుపు తెగ నిద్దుర పోయేదాన్ని.లేపలేకుండా చచ్చేవాడు."

"ఎవరు సర్బనా?"

"అవును ! లేపినప్పుడల్లా 'ఇదిగో లేస్తూన్నా' అని మళ్ళీ పడుకునే దాన్ని.ప్రాణం విసిగి అతడే టీ పెట్టుకునే వాడు."

"భానో!"

"ఇప్పుడు ఒకవేళ సరబన్ మళ్ళీ ఎక్కడనుంచైనా ఊడిపడ్డాడనుకో అప్పుడు నన్ను వదిలేసి పోతావా?"

"భలేవాడివి. చచ్చినవాళ్ళు ఎక్కడనుంచైనా మళ్ళీ లేచి వస్తారటయ్యా. ఓహో అందుకనేనా మళ్ళీ పెళ్ళి చేసుకొచ్చావు అని అడగనూ."

"ఆ, లేకపోతే అక్కడ నీకోసమే కాచుకుని కూర్చున్నాడనుకున్నావా? ఆవేళ ఎక్కడుంటాడో ఏమో."

ఆ మాట వినగానే ఆరాత్రి చీకటంతా తననే అలుముకున్నట్లుగా భానోకి అనిపించింది.

కొన్ని క్షణాలు విశ్శబ్దంగా ఉన్న తరువాత నారాయణుని మళ్ళీ అడిగింది, "సరేగాని నేను మీ మంచం మీదకు రానా?"

"మీ దగ్గరకి వస్తే నాకున్న భయం అంతా పోతుంది."

"నువ్వేం చిన్న పిల్లవా?"

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. ఇందులో భయపడటానికి ఏముందోనని. నేనేమి చిన్నపిల్లనా?"

"భానో సాయంత్రం నువ్వు ఎక్కడికెళ్ళావు? నాకు అప్పుడు టీ తాగాలనిపించింది. నువ్వు వస్తావేమోనని గంటల తరబడి ఎదురు చూశాను."

"నేను అలా బయటికి వెళ్ళాను."

"అంతసేపా?"

"అక్కడ శ్యామో కనిపించింది. దానిది మాఊరే కదా!"

"మీ ఊరు మీద అంత మోజు అయితే అక్కడే వెళ్ళి ఉండకూడదూ," నారాయణ్ అటువైపు తిరిగి అన్నాడు.

"మీ మంచం మీదకి రానా" అని తానై అడిగిన నారాయణ్, ఆ క్షణంలో భానోకి వింత మనిషిలా కనపడ్డాడు. ఆ క్షణంలో ఎవడో అపరిచితుని చెంత ఉన్నట్లు అనిపించింది.

భానో లేచి ప్రమిదలో నూనెపోసి వత్తి మీదికి దీపం వెలిగించింది.

ఆ దీపం కాంతిలో ఆ సాయంత్రం కడిగి బోర్లించిన గిన్నెలన్ని ఉజ్జ్వలంగా కనిపించాయి. ఎదురుగా పెట్టెల దగ్గిర రాట్నం పడి ఉంది. దాంతో క్రితం రాత్రి వరకు దారం వడుకుతూనే ఉంది.దొడ్లో గేదె నిలబడి నెమరువేస్తూ ఉంది. ఆ పక్కనే గుమ్మంలో ఆవిడ చెప్పులు ఉన్నాయి. ఆ దీపం వెలుగులో ఇల్లంతా కొత్తగా కనిపించలేదు.

గేదె ముందు ఖాళీ తొట్టెలో కొంచెం గడ్డి వేసింది. చేత్తో దాని వీపు నిమిరింది. మంచం మీద పడున్న బొంతను తీసి దాని వెన్నుమీద వేసింది.

"మళ్ళీ దీపం వెలిగించావూ?" అన్నాడు కోపంగా

"అప్పుడప్పుడు నేను ఆరాటపడి పోతూంటాను అని చెప్పాను కదా

మరి." భానో పొద్దునే లేచి రాజేయడానికి వీలుగా దాలిలో పిడకలు సర్దుతూ అంది.

"మరి గింజలు నానపెట్టడం మరిచాను." భానో సొట్టలు పడ్డ గిన్నెలో గింజలు నానబోస్తూ అంది.

" నీకేమైన జ్ఞాపకం అంటూ ఉంట్టుందా లేకపోతే అన్నీ మర్చిపోతూ ఉంటావా?"

నారాయణ్ పడుకుని తలలోంచి పళ్ళు విరిగిన దువ్వెన బయటకు తీసి దువ్వుకుంటూ ముటముటలాడిపోతూ అన్నాడు.

"అయ్యో నా మతిమరుపు ముండ ఏమైనా గుర్తు ఉండటం లేదు."

"మనస్సు ఇక్కడ ఉంటేకదా!"

"ఇక్కడ లేక ఎక్కడ చచ్చింది. నూతిలో పడిందా."

"రెండు నెలలనుంచి చూస్తున్నాను, నీ అంతూ పంతూ చిక్కడం లేదు."

"మా బాబు ఎలా ఉన్నాడో ఏమో కాస్త వాకబు చేయండి."

"వాడికేం నిక్షేపంలా ఉన్నాడు. ఇంకా నిన్ను ఈ బాబు బెంగే పట్టుకుని పీడిస్తుందా?"

" బాబు మనస్సు చెడ్డది కాదు. కొడుకు పోయినప్పటి నుంచీ వాడికి ఈ లోకంలో స్పృహే ఉండటం లేదు. సొంత ఆలోచన అంటూ ఏమీ లేకుండా ఎవడేం చెబితే అలా చేస్తూ ఉంటాడు."

"నిన్ను మారుమనువుకి మళ్ళీ అమ్మేయాలనుకున్నాడు కదా. నువ్వేమో వాడి మనస్సు అంత చెడ్డది కాదంటావు."

"రేపు ఒకవేళ నేను కన్ను మూస్తే దీని గతి ఏం కాను అని అస్తమానం ఆరాట పడుతుండే వాడు.చుట్టాలు ఎంతకాలం అని చూస్తారు. ఎవరని చూస్తారు.భానోను మంచితనంగా పంపిస్తావా నరేనరి లేకపోతే మేము బలవంతంగా ఎత్తుకుపోతామని మోరావారి నుంచి కబుర్లు వస్తూండేది."

"అందుకనే అనుకున్నాడు మీ బాబు అలాంటిదేదో జరగకముందే వచ్చినంత రాబట్టుకుందామని."

"అబ్బే అలాగా మీకేం తెలును? మేమంతా ఎన్నో కష్టాలు అనుభవించాము. నేను అనలే పిరికిదాన్ని తెల్లారిగట్ట ఇంటి బయటికి

వచ్చేదాన్నే కాను. పాపం మాబాబు ముసలాడు ఏం చెయ్యగలడు ఎవరైన రెండు దెబ్బలు కొట్టేయవచ్చు. అన్నదమ్ములు లేనివారి బ్రతుకు ఏం బ్రతుకు.పల్లెటూళ్ళలో అలాంటివాళ్ళ గతి ఏమిటి?"

"నువ్వు వట్టి అమాయకురాలివి. ఇంతకీ ఆడదాని ఇష్టం లేకపోతే దాని దగ్గరకి వెళ్ళడానికి ఎవరికీ వీలుండదు. దానిగాలైన సోకనీయదు."

"కాదుకాదు. చెడ్డవాళ్ళ సంగతి నీకేం తెలుసు సొంత సోదరుడికైనా..."

"ఆ మాట అక్కడికి వదిలెయ్. రోజంతా వాడి కోసమే దేవులాడుతూ కూర్చోకు."

"ఏం చెయ్యను ఈ సంగతే నన్ను అస్తమానం లోలోపల వేధిస్తోంది. మన మనస్సుకి గడిచిపోయిన గొడవ ఎందుకని ఎంత సరిపెట్టుకుందామన్న కుదరడం లేదు. దేముడి దయ వల్ల ఇప్పటికి ఓ దరి చేరుకున్నావు. అడక్కుండా పెట్టకుండా ఇల్లంతా అప్పగించిన ఆ మహానుభావుడికి దేవుడు ఎంతో మేలు చేయాలి."

"సరే ఇంక పడుకో."

"నీకేదైనా కష్టం కలిగితే మనస్సులో కుళ్ళకుండా ఆ మాటేదో పైకి చెప్పేయి. మతి సరిగ్గా ఉన్నట్లు లేదు."

"భానో!"

దేనికి?

"నేను అప్పుడప్పుడు చుక్కేసుకుంటూ ఉంటాను. దాంతో జుట్టంతా తొందరగా నెరసి పోయింది. ఇంతకీ చెప్పొచ్చిందేమిటంటే నావయస్సు అంత ముదరలేదు. జుట్టు ఎందుకు నెరిసిపోయిందో? అని నువ్వు ఆలోచిస్తూ ఉంటావుకదూ."

"మా అన్న మీద ఒట్టు. నేను ఈ విషయాన్ని కలలో కూడ అనుకోలేదు. ఈ రోజుల్లో జుట్టు నెరవడం ఎంతసేపు మాములే. చిన్నచిన్న పిల్లలకు కూడ జుట్టు ఇట్టే నెరిసిపోతూంది."

"భానో!"

"ఏమిటి?"

"సాయంత్రం అదెవరితో దొమ్మరిది అనుకుంటాను మట్టిబొమ్మలు అమ్మకానికి తెచ్చింది కదూ."

"అవును."

"అయితే కొనలేకపోయావా?"

"బొమ్మలతో ఆడుకునేవాళ్ళు ఇక్కడెవరున్నారని?"

"ఇప్పుడు లేకపోతే తరువాత రాకూడదా?"

భానో ఏం మాట్లాడలేదు.

"భానో!"

"ఎందుకు?"

"నీకో బిడ్డుంటే బాగుంటుందని అనిపించటం లేదూ."

"వాడు పోయినప్పుడు నాకు అస్తమానం అనిపించేది వాడి గుర్తుగా ఎవరో ఒకరు ఉంటే ఆ పాపతోటే నాకు అస్తమానం కాలక్షేపం అయ్యేది కదా అని. ఆ తరువాత...ఆ తరువాత..."

"నేను అనేది అప్పటి సంగతి కాదు ఇప్పటి మాటే."

"నీకు కావాలనిపిస్తే దేవుడి దయవల్ల ఆ కోరిక త్వరలోనే నెరవేరవచ్చు. అయితే వాడు పోయినప్పటి నుంచి నాలో అన్ని మోడుబారి పోయాయనుకున్నాను. ఇప్పుడింక ఏం చిగురిస్తుంది. ఏం పూలు పూస్తుంది."

"దానికేముంది భగవంతుడు తలచుకుంటే అన్ని అవే చక్కబడతాయి. నువ్వు మాత్రం దగా చేయకు."

"నాకు ముందూ వెనుక ఎవరున్నారని దగా చెయ్యడానికి. బతక్క నూతిలో పడి ఛస్తామా."

"ఆడవాళ్ళ మాట చెప్పేదేమిటి.క్షణంలో అన్నీ సమకూర్చుకుంటారు. రెండు నెలల పూర్వం నువ్వెవరో నేనెవరో!"

"అలాంటి ఆడవాళ్ళు నాలాంటి వారు కారేమో అని అనాలనిపించింది భానోకి, కాని అంతలో తమాయించుకుంది. ఒకవేళ అలాంటివాళ్ళు కూడా తనలాంటి వాళ్ళేమోనని వూరుకుంది."

"భానో."

"ఊ !"

"కోపం వచ్చిందా?"

"నాకెవరి మీదైన కోపం దేనికి?"

"నామీదే."

"ఆ మాలది లేదూ రలీ, ఒక పావు నెయ్యి అడిగింది. పిల్లాడికి జబ్బు చేసింది మందులు అవీ కావాలంది."

"ఇవ్వలేకపోయావా మరి."

"మిమ్మల్ని అడిగిస్తానన్నాను."

"భానో ఇప్పుడిది నీ ఇల్లు. నీ ఇష్టం వచ్చినట్లు చేయి."

"సరబన్ అయితే నాకు దేనికీ అడ్డుమాట చెప్పలేదు.మీ సంగతి ఇంకా నాకు అంతుబట్టలేదు కదా.మీరు బహుశా...?"

"భానో !" నారాయణ్ ఒక్క కేకశాడు.

"చిత్తం," భానో ఎంతో వినయంగా అంది.

"నా ఎదురుగా ఇంకెప్పుడూ సరబన్ ఊసెత్తకు."

"సరే అయితే" అంటూ భానో ఉఫ్ మని నోటితో దీపం ఆరిపేసి తూలుతూ తూలుతూ వచ్చి మంచం మీద పడింది.

"నోటితో దీపం ఆర్పడం ఎంతో తప్పు అని చిన్నప్పుడు మా అమ్మ చెప్పిన మాట జ్ఞాపకం మొచ్చింది."

# 3

కొట్టులాంటి ఇల్లు చక్కగా అలికి ముగ్గు పెట్టినట్లుంది. పాలు పారబోసి ఎత్తుకుని తాగేటట్టుగా ఉంది.

అందమైన ఆడది తన విజ్ఞానమంతా ఒలకపోస్తూ పురివిప్పిన నెమలి పింఛంలా తయారు చేసిన పీట అక్కడుంది.

ఆ పీట మీద ధగధగా మెరిసిపోయేట్టు కడిగి బోర్లించిన గిన్నెలున్నాయి.

రాజేసిన పొయ్యి.

దాని మీద సెగలు పొగలు చిమ్ముతూ ఉడుకుతున్న కూర లోనుంచి వెలువడే ఆవిరి.

ఆ పక్కనే కూరలో తాలింపు కోసం వెల్లుల్లిపాయలు ఒలుస్తూ కూర్చున్న భానో.

"ఒరే నారాయణ్ మీ ఆవిడ చాలా నేర్పరిలా ఉందే." శుభ్రంగా ఉతికి ఆరవేసిన బట్టలు కట్టుకుని కూర్చొని తాపీగా పొగ తాగుతున్న నారాయణ్‌తో అంది. కాళ్ళలో ముళ్ళు తీయించుకోడానికి వచ్చిన సంతి.

"ఏవమ్మా వదినా అంత మరీ పొగిడేసి చెడగొట్టకు"

"పోవయ్యా ఇంతకీ చెడిపోయిన వాడివి నువ్వు. ఎప్పుడు చూసినా మత్తులో మునిగుంటావు. చూడు శరీరాన్ని ఏ స్థితికి తెచ్చుకున్నావో. ఊచల్లా ఎండిపోయిన కాళ్ళు చేతులూ, పీక్కుపోయిన దవడలూ నువ్వూను. నాయనా ఏం చెప్పమంటావు పాలు నెయ్యి తాగేవాడి సంగతి వేరూను."

"అందరూ నన్ను చీదరించుకునే వాళ్ళే అన్నాడు భానోకేసి చూస్తూ."
"అది చాలదన్నట్లు నువ్వు కూడ మొదలెట్టావూ? నేను ఎవరితో చెప్పుకోను. అన్నా, తండ్రా ఎవరున్నారని."

"మంచి పని చేసింది నిన్ను సాధించి. నువ్వు తక్కువ వాడివి ఏం కాదు. తగ్గవాడవే. వీటి అన్నిటివల్ల నీకేం ఒరుగుతుంది. నెత్తురు మరిగి పోతుంది. భంగో, కల్లో, సారాయో, ఏదో ఒకటి ఎప్పుడూ తాగుతూనే ఉంటావు కదా."

"ఏం చెప్పను మొన్న ఏకాదశి నాడు నాతో గుడికొచ్చి ఇంక తాగనని ఒట్టేట్టుకున్నాడు. రెండు రోజులైనా కాలేదు.మళ్ళీ మొదలు. చివరికి దేముడితో కూడా అబద్ధం ఆడాడు." అంది భానో ఫిర్యాదు చేస్తున్నట్లుగా.

"ఆ దేవుడు మాత్రం తాగకుండా ఉన్నాడా. ఎప్పుడూ ఏదో తాగుతూ ఉంటాడు. బహుశః పగలు కూడా తాగి మత్తుగా పడి ఉండాలి.కనుకనే ఈ లోకమెంత అంధకార బంధురంగా ఉంటోంది. కాకపోతే మరేమిటి వదినా" అన్నాడు నారాయణ చిలుకు గట్టిగా పీలుస్తూ.

"నోరు మూసుకుని పడివుండరా. ఎప్పుడూ భగవంతుడికి ఝడుస్తూ ఉండాలి. వాడి లీల ఏం తెలుస్తుంది."

"చూడు తల్లీ ముల్లు వచ్చేసింది" భానో చేతులోకి సూది తిరిగి ఇచ్చేస్తూ అంది.

"సుఖంగా ఉండు. దేవుడు నిన్ను చల్లగా చూడాలి.దేవుడు దయతలచి నీకో కొడుకును ఇవ్వాలి. నీ వంశం పచ్చగా కళకళలాడుతూ వర్ధిల్లాలి. ఆ తరువాత వీడు ఎలా తిరిగినా ఫరవాలేదు."

"నీకు తెలియదు వదినా, ఇది నన్ను ఇంకా కుఱ్ఱాడు అనుకుంటూంది. నువ్వు ఎప్పుడైనా చూశావో లేదో కాని ఇది నా మీద ఎంత మిడిసి పడుతుందని. ఒక్కొక్కసారి ఉతికిన బట్టలు కట్టుకోమంటోంది. ఇంకోసారి చెప్పులు ఇక్కడ విడవమంటోంది. ఓసారి కొట్టుకెళ్ళి నరుకులు తెమ్మంటుంది. ఇప్పుడేమో నువ్వులు దంచమంటుంది." అన్నాడు నారాయణ్ చేతిలో పొగ గొట్టం అక్కడ పెట్టి నువ్వులు బుట్ట పుచ్చుకుంటూ.

"పోరా ! వచ్చినప్పటినుంచి నిన్ను మనిషిగా మార్చింది."

"పైగా ఇదొకటా? మొదట్లో నేను మనిషిని కాను?"

"పెద్దది వదిన హాస్యానికి అంటే ఇంతలో పోయిందేమిటి" అంది భానో పొయ్యిలో నిప్పుతీసి సంతికి అందిస్తూ.

"సరే అయితే నారాయణ్ నేనిప్పుడు నీకో మాట చెప్పనా. మంచో

చెడో నువ్వేమన్నా అనుకో. ఇప్పుడు నువ్వు అడ్డమైన వాళ్ళను ఇంటికి తీసుకుని రావడం మంచి పనికాదు. దేవుడి దయవల్ల ఇప్పుడు నీ ఇల్లు నిలబడింది. వచ్చేపోయే నక్షత్రం కొంప కాదు. ఇవ్వుడింక నువ్వు గృహస్థులందరి లాగే మసలుకోవాలి."

"వదినా అల్లాటప్పా వాళ్ళను నేనెవర్ని పిలుస్తాను వాళ్ళే వస్తూంటారు."

"వాళ్ళు చుక్కేసుకోవడానికి వచ్చినప్పుడల్లా ఇక్కడ కాదు అక్కడ గురుద్వార వక్కన ఉన్న బావి దగ్గరైనా త్రాగండి లేకపోతే బాబా మకాంలోనైనా త్రాగండి. చెల్లెలు, పిల్లలు ఉన్న ఇళ్ళల్లో ఇలాంటి పనులు అంత బాగుండవు అని చెప్పేసేయ్."

"నేను శతపోరాను కాని విన్నదెవరు. ఒక్క చుక్క నోట్లో పడేసరికే మత్తెక్కి పడిపోతాడు. ఇంక ఆ మొదట మిగతా వాళ్ళు వళ్ళంతా కళ్ళు చేసుకొని మిటకరిస్తూ చూస్తూంటారు." అంది భానో నారాయణ్ చేతిలో నుంచి తీసుకుని నువ్వులు దంచుతూ.

"ఇంతటి అప్సరసని వాళ్ళు తొంగితొంగి చూసున్నారా. భలే!"

"ఒరేయ్ తాగిన తరువాత ఏం చూస్తూన్నామో ఏం చేస్తున్నామో ఏం తెలుస్తుందిరా, నారాయణ్!"

"తెలియక ఏమవుతుంది వదినా."

"భలేవాడివే నీ ఇంటి పరువు మర్యాదలు మంట గలుపుతావు."

"ఈసారి వాళ్ళు వచ్చినప్పుడు చెపుతానులే. అయితే వదినా నువ్వు దీనికి కూడా చెప్పు. ఎవళ్ళింట్లోనైనా కాస్త పూజ పునస్కారం జరగటం భయం. ఇంక రోజంతా అక్కడే ఉంటుంది. అందరిళ్ళలోనూ ఎంగిలి కంచాలు కడుగుతుంది. చెప్పులు తుడుస్తుంది. ఇదంతా లోకోపకారము అంటుంది. ఇంక ఇంట్లో నేను తిండి తిప్పలు లేకుండా ఆకలితో మలమల మాడి ఛస్తున్నా సరే."

"ఒరేయ్ నారాయణ్! ఇందులో తప్పేముంది. కొంచెం ముందు జాగ్రత్త కూడా ఉండాలి. పూర్వ జన్మలో మంచి కర్మలు చేసుంటే...నేర్పరులు లజ్జావతులైన భార్యాపిల్లలు కాళ్ళు కడిగి నెత్తిన చల్లుకుంటారు.చరణామృతం క్రింద సేవిస్తారు."

"దీనిని వెనుకేసుకునే మాట్లాడతావని నాకు తెలుసు."

"అదేంకాదు. నేను ధర్మమే మాట్లాడుతున్నాను. నాకు దీని దగ్గరనుంచి లంచం పుచ్చుకోవలసిన అవసరం లేదు. నీ దగ్గర నుంచి ఏమీ అక్కరలేదు."

"చూడమ్మా సరిపోయిందా?" చిమ్మిలుండ ఒకటి భానో చేతిలో పెట్టి ఎలా ఉందో చెప్పమంది సంతిని.

"కోడలుపిల్లా నేనేం పసిపాపననుకున్నావా" చేతిలో ఉండ చిదిపి కాస్త నోట్లో వేసుకుంటూ సంతి అంది.

"సంతి! ఓ అమ్మా సంతి!"

"దయాలో పిలుస్తున్నట్లు ఉంది. వస్తున్నాను." ఆ మిగతా ముక్క కూడ నోట్లో వేసుకుని సంతి మూతి తుడుచుకుంటూ బయలుదేరింది.

"నమస్కారం అమ్మా" అంటూ పాదాలను తాకి "ఎక్కడికి వెళ్ళావు? నేను ఇందాకటి నుంచి వెతుకున్నాను.తెగ తిరిగాను."

"చిరంజీవా, చిరంజీవా. దేవుడు మేలు చేయుగాక. నేను కాలులో ముల్లు తీయించుకోవడానికి భానో ఇంటికెళ్ళాను. తీరా వెళ్ళాను కదా అని నారాయణ్‌కు ఓ సలహా చెప్పిపోదామనుకున్నాను. నాయనా ఇదంతా పెద్ద మనుషులు ఉండే చోటు.అందుకని అల్లరి చిల్లరి అలగా జనాన్ని పోగుచేయకు. తిరుగుబోతుల్ని, తాగుబోతుల్ని చేరదీయకు.అందరిళ్ళలోనూ పిల్లలు, పాపలూ,అక్కలూ,చెల్లెళ్ళు ఉన్నవారే."

"అమ్మా నువ్వు వృత్తి వెట్టిదానివి. నారాయణ్ కోసం ఎవరు వస్తారు. నువ్వు చాలా తెలివైన దానివి ఆ వచ్చే వాళ్ళందరూ దాని కోసమే వస్తారు."

"దేవుడు మీద ఒట్టు. భానోని చూస్తే అలాంటి మనిషి అనిపించటం లేదు."

"కనపడటం లేదు అంటే ఇంకోలా కనపడుతుందేమిటి. అత్తిల్లు, పుట్టిల్లు అనకుండా తిరిగే మనిషి నీ కంటికి గంగిగోవులా కనపడుతుందేమిటి?"

"ఏమో ఎవరికి తెలుసు. ఎవరెందుకు నిప్పులో పడతారో."

"నీ సంగతే చెప్పాలి. లోకంలో అందరూ నీలాంటి వాళ్ళే అనుకుంటారు. నువ్వు ఎన్ని చెప్పు నాకు మాత్రం దాని వాలకం ఏం నచ్చలేదు. పూజా పునస్కారము ఎక్కడ జరుగుతుందో అక్కడికి అందరికంటె ముందు తయారు. పెద్ద భక్తురాలు బయలు దేరింది! వెయ్యి ఎలకలను తిన్న పిల్లి కాశీ యాత్రకు బయలు దేరిందట."

"ఒసేయ్ దయాలో రాముడి సంగతి రాముడికే తెలియాలి. మనం అనవసరంగా నోరు పారేసుకుని పాపం కట్టుకోవడం దేనికి. దండ కడియం చాలా బాగుందే. కొత్తగా చేయించుకున్నావా ఏమిటి?"

"లేదమ్మా బిడ్డ పుట్టినపుడు మావాళ్ళు చేయించి ఇచ్చారు. ఈ ఇంట్లో అడుగు పెట్టినప్పటి నుంచి ముక్కుపుల్ల కూడ అమర్చుకోలేదు."

"ఏం చెప్పమంటావు. ఈ రోజుల్లో సంసారాలే అంత."

"నా దగ్గరకి వచ్చేటప్పటికీ ఈ సంసారపు భాద్యతలన్నీని. వాళ్ళ అక్కచెల్లెలో వచ్చేటప్పటికి వెంటనే దుకాణానికి వెళ్ళి గుడ్డలు కొనుక్కొని వస్తాడు."

"న్యాయంగా వాళ్ళకు పెట్టాల్సిందే కదా. లేకపోతే అవతలి వాళ్ళు పుట్టింటి వాళ్ళు ఒక్క జత బట్టలైనా పెట్టలేదని చెప్పుకు చెప్పుకుని చస్తారు కదా."

" మీ భానో కబుర్లు ఇంకాసేని చెప్పు." దయాలో ఎండలో పెట్టిన కవ్వం చక్రం మీద వెన్న జిడ్డుని తీసి చేతులకు రాసుకుని దానిమీద మురికి పారలను తీస్తూ అంది.

"పాపం మంచిపిల్లే."

"అంత పాపం అని జాలి పడాల్సిందేం కాదు. మా ఊళ్ళోనూ ఉండేది. అలాంటి పింజారిలంజ. ప్రొద్దున్నేలేచి గురుద్వారాకు ప్రార్థన వినడానికి వెళ్ళేదట. అప్పుడే కన్నవాళ్ళకి కట్టుకున్న వాళ్ళకి నెత్తిన చేతులెట్టి పూజారితో లేచిపోయిందట. ఆ తరువాత వాళ్ళవాళ్ళు ఎంతో వెతికారు. చివరికి స్టేషనులో పట్టుకున్నారు. ఆ పూజారి మొహానికి మసిపూసి మెడలో చెప్పుల దండేసి గాడిద ఎక్కించి ఊరంతా ఊరేగించారు. అన్ని వీధులూ తిప్పారు. దాని తండ్రిని పిలిపించి నీ కూతురుని నువ్వు తీసుకుపో. తీసుకెళ్ళి దగ్గరే ఉంచుకుంటావో నూతిలో పారేస్తావో ఇంకేం చేసుకుంటావో నీ ఇష్టం.అది మాకు పనికి రాదు" అన్నారు.

"కూర్చో, టీ కాచనా?"

"వద్దమ్మా నేనొచ్చిన పని వేరే ఉంది."

"చెప్పు. దానికేం భాగ్యం. చేయిగలిగినదయితే నిక్షేపంగా చేస్తాను."

"ఏంలేదు కొంచెం సారా ఉందేమోనని, అడుగుదామని వచ్చాను.కుర్రాడికి దెబ్బ తగిలింది. తుడిచి, పోసి కట్టుకడదామని."

"అయ్యో మా ఇంట్లో సారా ఎందుకుంటుంది? మా ఇంట్లో ఎవ్వరూ తాగరు. ఉంటే నారాయణ్ ఇంట్లో ఉండవచ్చు."

"ఆ మధ్య సీతో మొగుడొచ్చాడు కదా అప్పుడు తెప్పించింది కాస్త ఏమైనా మిగిలిందేమోనని?"

" నిజమే. వాళ్ళు వచ్చినపుడు తెచ్చిన మాట నిజమే. కాని వాడింట్లో ఉన్నంత కాలం తాగుతునే ఉన్నాడు. ఖాళీసీసా ఆ మాలాడు లేడు మాధవ్ కూతురు మీ బాబాయిని అడిగి పట్టుకుని పోయింది. నీకు తెలుసు కదా ఆయన సంగతి. ఎవరొచ్చి ఏం అడిగినా లేదనలేడని. వచ్చి ఒకటే గోల చేసింది. అదే పనిగా అడిగింది. బాబా దుకాణం నుంచి కిరసనాయిల్ తెచ్చుకోవాలంటే కష్టపడి పోతున్నాడు. ఈ సీసా నాకిచ్చేయమని కూర్చుంది. అక్కడికి నేను చెప్పాను. ఇంట్లోకి కావాలని. అలాంటి సీసా బజారులో అమ్మితే మూడు అణాలకు పైగానే వస్తాయి. నువ్వు వెళ్ళి భానోని అడుగు."

"దాని మొహం చూడటానికి నాకిష్టం లేదు. నా మరిది తోటి నిన్న దెబ్బలాడాను కూడానూ. దాని ఇంటిచుట్టూ తిరుగుతున్నావెందుకని మందలించాను."

"ఒసేయ్ దయాలో నా మాటవిని నీ మరిదికి ఇప్పుడైనా పెళ్ళి చేసేయ్. లేకపోతే ఎప్పటిదాకా నీ వంట తింటూ ఉంటాడు!"

"ఇంతకీ ఏదైనా సంబంధం కలిసి రావాలి కదా. అప్పుడు మాట చూసుకోవచ్చు. తక్కువ సంబంధాలంటే ఇష్టం లేదు. రెండు మూడు రోజులలోనే విడిపోవచ్చు. ఇది పెద్దాశయం కోరి మరిదికి పెళ్ళి చెయ్యటం లేదని అందరూ అంటూనే ఉన్నారు. దేవుడి మీద ఒట్టు. నేను మీ వాడితో ఎన్నిసార్లో చెప్పాను. బాబు నీకు పుణ్యం ఉంటుంది. ఏదైనా సంబంధం ఉంటే వెంటనే చూసి మూడుముళ్ళు వేయించేయి. లేకపోతే అందరూ నన్నే అంటారు అని ఎన్నిసార్లో చెప్పాను."

"ఇలా ఒంటరిగా ఎన్నాళ్ళు తిప్పలు పడతావు. ఎవతైనా వస్తే కాస్త చేతిలో పని అందుకుంటుంది."

"దానికేంత నా చేతిలో పని అందుకున్నా మానినా ఇల్లు కళకళలాడుతుంది కదా."

"బహుశః అదిగో జాగర్ వస్తున్నట్లున్నాడు" నంతి చెయ్యి నుదురికి అడ్డం పెట్టుకుని దూరంగా వస్తున్న జాగర్ కేసి చూసి అంది.

"ఆ వచ్చేది ఆ చచ్చినవాడే. బహుశః భానో ఇంటి నుండే వస్తూ ఉండవచ్చు. పాడుం పీల్చేవాడు. వచ్చిన పనంతా చెడగొట్టేవాడు."

ఇంతలోకి జాగర్ అక్కడికి వచ్చాడు.

"ఎక్కడి నుంచిరా తలెగరేసి వస్తున్నావు ఓ జాగర్ నిన్నే?" దయాలో గట్టిగా అడిగింది.

"నేను నిన్ను పిలవడానికే వచ్చాను వదినా. పిల్లాడు గుక్కపెట్టి ఏడుస్తున్నాడు. నువ్వు ఎంతకీ రాలేదని."

"సారాచుక్క ఎక్కడైనా దొరుకుతుందేమోనని చూస్తున్నాను. దొరకగానే వచ్చేద్దామనుకున్నాను."

"సరే నేను నారాయణ్‌ను అడిగి పట్టుకొస్తాను."

"సరే అయినా నారాయణ్ ఇంట్లోగాక నీకు సారాయి ఇంకెక్కడ దొరుకుతుందిలే!"

"నువ్వు వెళ్ళు. నేను ఇప్పుడే వస్తున్నాను." అంటూనే జాగర్ భానో ఇంటికేసి వడివడిగా వెళ్ళిపోయాడు."

"చూశావా వీడి వేషాలు. అది లేకపోతే వీడికి ఊపిరాడదు. సరేవాడిని ఇంటికి రాని ఈవేళ చెప్పుతాను. వాడి కాళ్ళూకీళ్ళూ విరిచి కూర్చోపెడతాను."

"నేను చెపుతున్నాను కదా దయాలో ఇలా గాలి పోగుచేసుకుని బాధపడకు. నారాయణ్‌కి జాగర్‌కి స్నేహితం ఈనాటిదా ఎన్నాళ్ళనుంచో సాగుతుంది."

"లేదమ్మా నీకేం తెలుసు దీని సంగతి? నారాయణ్ ఉన్నాడే వాడు పట్టి దున్నపోతు. అది పోతుపోతూ కూడ కనుసైగ చేసి పోతుంది. ఎవరో చెప్పారుకదా అది మా నూతి దగ్గరికి కూడ వస్తూ ఉంటుందని.దాని జుట్టుపీకి కూర్చో పెడతాను. వాళ్ళవాళ్ళు ఎవళ్ళో చచ్చినట్లు ఏడుస్తూ పోవలసి వస్తోంది."

"ఒసేయ్ దయాలో కళ్ళారా చూడందే ఎవరి గురించి ఏమి అనకూడదు. ఈ రోజుల్లో నిప్పెట్టి రాజేసేవారు చాలామంది ఉన్నారు."

"వదినా నువ్వు ఇంకా ఇంటికి వెళ్ళలేదు ఏమిటి. పిల్లాడక్కడ ఏడుస్తూ ఉండి ఉండవచ్చు. సరే ఇంక బయలుదేరు.ఇదిగో నేను సారా తెచ్చాను." దోవలో జాగర్ తన చేతిలోని సారా గిన్నెకేసి చూపిస్తూ అన్నాడు.

దయాలో కూడ వాడి వెనుకనే బయలుదేరింది.

"జాగర్ నీ పోకిరి వేషాలేమి నాకు నచ్చడం లేదు." సందులోకి మలుపు తిరుగుతూ దయాలో జాగర్ని మందలించింది. వాడికేసి అప్పటికప్పుడు అక్కడికక్కడే మింగేసేటట్లు చూసింది.

"నీకెందుకు వచ్చిన బాధ ఇదంతాను వదినా అదేమైనా నీకంటె మహా అందంగా ఉందా?" జాగర్ మెల్లిమెల్లిగా వదినగారిని పొగడటం మొదలెట్టాడు.

"ఆ నాకు తెలియదేమిటిలే బహుశః వదిన ముసిలిది అయిపోయింది. ఇంక దీనితో మనకేమిటి వని అనుకున్నావేమో" అన్నది దయాలో ఊడిపోయిన చొక్కా బొత్తామును సరిచేసుకుంటూ.

"అబ్బే అదేంలేదు. నువ్వు నాకళ్ళకి ముసిలిదానిలా కనపడటం లేదు. కాని ఒక్కటే లోటు. నువ్వు అస్తమానం ఎందుకో అందుకు పోట్లాడుతునే ఉంటావు."

"మరే పాపం దెబ్బలాడక నిన్ను నీ ఇష్టం వచ్చినట్లు తిరగనిస్తాన నుకుంటున్నావా? చూడు ఒక ఆడదంటే మరో ఆడదికి పడదు. ఎవరు ఎవరిని ఉంచుకున్నారో తెలియదు. నీకు కాలు కుదురు ఎక్కడుంది. త్రిలోకసంచారివి."

"లేదు వదినా భానో అలాంటిది కాదు."

"మరేరా పాపం, నాకు తెలియదు కాబోలు. భానోని వెనకేసుకొచ్చే పెద్ద మగాడు బయలుదేరాడయ్యా ఎలాగయితేనేం ఇన్నాళ్ళకి. అలాంటి వాళ్ళ సంగతి కనిపెట్టడానికే వస్తూంటారు నీలాంటి వాళ్ళు. కాకపోతే అదేం పత్తిత్తా? ఇప్పటిదాకా ఎంతమందిని పట్టుకుందో, ఎంతమందిని వదిలేసిందో లెక్కా డొక్కా ఏమో ఎవరికి తెలును. సరేలే ఇంటికి నడు. నీ సంగతంతా మీ అన్నయ్యకు చెపుతాను."

"ఏం చెప్తావు," అన్నాడు జాగర్ గద్దింపుగా.

"వీడు ఎప్పుడూ నారాయణ్ ఇంట్లో దూరుతూ ఉంటాడని చెపుతాను."

"నేనూ చెవుతాగా. వదిన ఎందుకు ధుమధుమ లాడుతుందో కనుక్కోమని."

"అవును ఎందుకు ధుమధుమ లాడుతుంటుంది అనుకున్నావు నువ్వు చేసే పనులకు కాకపోతే నీకు లేదుగాని నాకు మాత్రం ఉంది సుమా ఇంటి గౌరవం కాపాడాలని. అదే చిన్న కుర్రవాడివయితే లాగి లెంపకాయి కొట్టి బుద్ధి చెప్పేదానిని. ఇప్పుడు పెద్దాడివి అయిపోయావు."

ప్రొద్దుగూకగానే బుడ్డి చంకనపెట్టి నారాయణ్ ఇంటివైపు ఎవరూ చూడకుండా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ పోయే జాగర్ అనుకుంటున్నాడు,"వదిన మంచి మాటలే చెపుతుందేమో...అబ్బే కాదుకాదు. నారాయణ్ నాకు మంచి స్నేహితుడు...భానో...అవును భానో...ఈవిడేమో నాకు వదిన."

మూసి ఉన్న తలుపులు మీద మెల్లిగా వేళ్ళు తాకించి తట్టాడు జాగర్.

రొట్టెలు చేస్తున్న భానో ఆ చేత్తోటే వచ్చి తలుపు తీసింది. జాగర్ నోట్లోనుంచి మాట పెగలక ముందే అది చెప్పింది. "జాగర్ మీ అన్న ఇంట్లో లేరు."

"నేను మేడమీద కూర్చుంటాను.వచ్చినపుడు అక్కడికి పంపించు." అంటూ జాగర్ మెట్లెక్కాడు.

కొంచెం సేపుండి మళ్ళీ కిందకు దిగి వచ్చాడు, "వదినా ఆ మంచినీళ్ళ చెంబు ఇలా పడేయ్. గ్లాసు కూడ తెచ్చిపెట్టు."

"మీ అన్నగారు వచ్చినపుడే నువ్వు రావయ్య జాగర్" అంటూనే భానో తలుపు మూసేసింది.

జాగర్ బలవంతంగా తలుపు తోసుకుని దాని వెనకాలే లోపలికి వెళ్ళాడు.

"వదినా నీకు నేను పరాయి వాడి ననుకున్నావా అసలు నారాయణ్‌కు నాకు చుట్టరికముంది తెలుసా. వాడు స్వయానా మా బాబాయి అవుతాడు. కాని చిన్నప్పటి నుంచి మంచి స్నేహితులం. అందుకనే వాడిని 'అన్నా' అని పిలుస్తున్నాను. చిన్నప్పుడు వాడు నన్నెత్తుకుని తిప్పుతూ తినిపించేవాడు."

"అదేంకాదు. నేను చెప్పదలచుకున్నదేమిటంటే మీ అన్న ఇంట్లో లేడని..." అలా అంటూనే భానో చెంబుతో నీళ్ళూ గ్లాసూ అందించింది

పంపించేయాలని. జాగర్ కొంతసేపు అలాగే మౌనంగా కూర్చున్నాడు. భానో మొహం లోకి అదే పనిగా చూస్తున్నాడు ఏదో చెప్పబోయేవాడిలా. భానో వాడికేసి చూడకుండ తదేక దీక్షతో రొట్టెలు కాలుస్తుంది. వాడు ఆ నీళ్ళ చెంబూ, ఖాళీగ్లాసు చేతపుచ్చుకుని మిద్దెమీదకి వెళ్ళాడు. వాడొక్కడే అక్కడ కూర్చుని తాగడం మొదలెట్టాడు.

భానో రొట్టెలు చేయడం ముగించిందో లేదో జాగర్ మళ్ళీ కిందకు దిగివచ్చాడు. రొట్టెలలో ఉండే ఆవిరంతా పోయిన తరువాత నెయ్యి రాయవచ్చునని భానో వాటిని పళ్ళెంలో పరిచింది. భానో దృష్టిని ఆకర్షించాలని జాగర్ లేని దగ్గు దగ్గాడు. ఇదేం పట్టించుకోకుండానే భానో నేతిగిన్నె తెచ్చి రొట్టెలపైన రాయడం ప్రారంభించింది.

"వదినా మీకు నామీద కోపమా" అన్నాడు జాగర్ చావిడిలో ఉన్న పీటమీద చతికిలబడుతూ. సారా వాసన గుప్పున మొహం మీద కొట్టింది. ఆవిడ ఒకసారి జాగర్‌కేసి తీక్షణంగా చూసి తన పనిలో తాను మునిగిపోయింది.

"వదినా ఈ చిన్న మరిదిని కూడ అప్పుడప్పుడూ నవ్వుతూ పలకరిస్తూండు మరి. సాధారణంగా వదినలందరూ మరుదులని వెయ్యి కళ్ళతో కనిపెట్టి చూస్తూ ఉంటారు."

భానో కొంచెం తీక్షణంగా చూసి అంది, "జాగర్ పైకెళ్ళి కూర్చో."

"నువ్వు నా మాట వినందే నేను పైకిపోను. ఇక్కడనుంచి కదలను" అన్నాడు జాగర్. కాళ్ళు జాపుకుని సావధానంగా కూర్చున్నాడు.

"జాగర్ ఇదేం బాగా లేదు." అంది భానో నీళ్ళు జిమ్ముతూ.

"వదినా కావాలంటే నా చర్మం వొలిచి చెప్పులు కుట్టించుకోగాని నాకేసి అంత తీక్షణంగా చూడకు." భానో ఏమీ మాట్లాడలేదు.

"అదే పొద్దస్తమానం ఆలోచనలతోనే గడచిపోతూంది. నీమొహం చూడాలని తపించిపోతుంటాను."

"నా మొహంలో ఏం ఉంది." రొట్టెలను గుడ్డలో చుట్టపెట్టి గిన్నెలో దాస్తూ అంది భానో.

"అదే నాకు తెలియటం లేదు. ఇంటి దగ్గర ఉన్నప్పుడు కూడ ఏవేవో

వింటూంటాను. ఇక్కడికి వస్తే నువ్వేమో చీదరించుకుంటూంటావు. అయినా చెంచలమైనా ఈ మనస్సు ఇక్కడికే లాక్కొస్తూ ఉంటుంది."

భానో పెనం మీద నీళ్ళు చల్లి దానిమీద పెచ్చుల్ని అట్లకాడతో దింపుతుంది.

"వదినా నరబన్ కూడ మా జట్టులో వాడే. ఓసారి జరగ్ తీర్థంలో మేము ఇద్దరం కుస్తీ పడ్డాము."

భానో కోపం కాస్త కరిగిపోయింది.

ఒక పెద్ద నిట్టూర్పు విడిచింది. జాగర్ కేసి అదోలా చూసింది.

ఇంతలో వాడు దాని చెయ్యి పట్టుకున్నట్లు గమనించింది.

"వద్దు జాగర్ వద్దు." చెయ్యి గింజుకుంటు భానో అంది.

"నువ్వు నా నెత్తురు తాగేశావు.నాకు రాత్రి పగలు ఒకటే బాధ. రెండు నెలల నుంచి నీ చుట్టు తిరుగుతున్నాను. నారాయణ్ కూడ ఒక మనిషేనా. వాడిని చూసుకుని నన్ను నిర్లక్ష్యం చేస్తున్నావు."

జాగర్ గింజుకుంటున్న భానోని లెక్కచేయకుండ కౌగిలించుకున్నాడు.

"వద్దు...వద్దు...వద్దొద్దు నేను గొడవ చేసేస్తాను. దయచేసి ఇక్కడ నుంచి వెళ్ళిపో."

"ఎక్కడికి వెళతాను?"

గేదె తలాడించింది. దాని మెళ్ళో కట్టిన గొలుసు చప్పుడయింది. ఆ సవ్వటికి నారాయణ్ వచ్చాడు కాబోలు అనుకున్నాడు జాగర్. వాడు భానోని వదలిపెట్టి దూరంగా తప్పుకున్నాడు. భానో అక్కడ నుంచి రివ్వున దూసుకుపోయి ఒక్కుమ్మడిగా బయట పడింది. వీధి తలుపు అలాగే వదిలేసి బెదురుతూ బెదురుతూ సంతి ఇంట్లోకి వచ్చి పడింది.

"నువ్వా భానో ఏం ఇలా వచ్చావు" గుమ్మం పక్కనే కూర్చుని ఉన్న కుక్కకి రొట్టె తుంపివేస్తూ అంది.

"నేనేనమ్మా," అంటూ భానో సంతి దగ్గరికి వెళ్ళి ఏడవటం మొదలెట్టింది.

"ఇంతకీ ఏమయింది చెప్పు. నారాయణ్ ఏమన్నా అన్నాడా" అంది సంతి దాని తల నిమురుతూ, ఓదారుస్తూ.

"లేదమ్మా. ఆయన ఇంట్లోనే లేడు. మరేమో జాగర్...జాగర్..." వెక్కి-వెక్కి వస్తున్న ఏడుపులో మిగతా మాటలు పెగలలేదు.

"ఓహో అదా సంగతి. వాడికెంత పొగరు. నేనిప్పుడే ఆ వెధవ పని పడతానుండు." అంటూ సంతి ఆ పక్కనే గుమ్మం దగ్గఱ గోడకు చేరేస్తున్న చెఱకు గడను తీసుకుని బయలుదేరింది.

"అమ్మా గొడవ చేయకు. నలుగురూ వింటే ఏమనుకుంటారు." అని బతిమాలింది భానో.

"ఏమన్నా అనుకుంటే అనుకుంటారు.ఇవేళ నీకయింది. రేపొద్దున మరొక్కళ్ళ మానం తీస్తాడు. అసలు ఈవేళప్పుడు మన వీధిలోకి రావలసిన అవసరం వీడికేమిటి?" అంటూ సంతి ముందుకు దూసుకుపోయింది.

సంతి అక్కడికి చేరుకునే సరికే జాగర్ అక్కడ నుంచి జారుకున్నాడు. కాని కనిపించిన వాడికల్లా సంతి చెపుతూనే ఉంది. ఎంత అన్యాయం దయాలో మరిది జాగర్ తప్పతాగి నారాయణ్ ఇంట్లోకి జొరబడ్డాడు.

"అసలేం జరిగిందో నీకు తెలియదమ్మా అలాంటి ఆడాళ్ళు అసలు వాళ్ళే కవ్విస్తూ ఉంటారు. పట్టుబడి పోతామేమోనన్న భయంతో అక్కడికి తామేదో పతివ్రతలు అయినట్లు నానాగొడవ చేస్తారు." అంది బచని సంతితోటి.

"లేదమ్మా అదికాదు. భానో వచ్చి ఇన్ని నెలలు అయిందా. అది అలాంటిలాంటి అల్లరి మనిషని ఎప్పుడు వినలేదు. అది అలాంటి మనిషి కాదు అసలు."

"జాగర్ పట్నం నుంచి దానికి ఓ కొత్త బట్టల జత కుట్టించు కొచ్చాడు కూడాను. లేకపోతే కొత్త బట్టల జత ఊరికే వస్తుందా?"

"అదేంకాదు. ఇది నాకు కళ్ళెదురుగా జరిగింది. నారాయణ్ కొని ఇంట్లో యిచ్చి రమ్మని నారాయణే స్వయంగా వాడి చేతికి ఇచ్చి పంపించాడుట. వాడేదో పని మీద ఎక్కడికో వెళుతూ."

"నీ ఎదురుగా వాడలా అనకపోతే ఇంకేమంటాడు."

"ఆ సంగతేదో దేవుడికే తెలియాలి." అంటూ సంతి గుమ్మంలో ఉన్న కుంకన్ని చేతిలో ఉన్న కట్టతో చావబాదింది. అది కుయ్యోమని కుంటుకుంటూ అక్కడనుంచి పారిపోయింది.

ఇవాళ మోటబావి దగ్గరకు వెళదాం అన్నాడు నారాయణ్ బుద్దిని దాచుకుంటూ తన ఇద్దరి స్నేహితులతో.

"ఇవాళ ఇంటికి వెళ్ళటం లేదా ఏమిటి" అన్నాడు బంతే.

"ఇంటి దగ్గర భానో గొడవ చేస్తుంది. మళ్ళీ ఎందుకు తాగుతున్నావని పోట్లాడుతుంది."

"ఏం తిన్నా తాగినా దెబ్బలాడే ఈ లంకిణీని ఎక్కడనుంచి తెచ్చావు."

చుక్క పడందే కదలలేని శరీరాన్ని భారంగా ఈడ్చుకుంటూ అన్నాడు బంతే.

"అవటానికి తెలివైనదే మరి భానో" లాభే కొడుకు ఇందర్ నారాయణ్ కేసి చూస్తూ అన్నాడు.

"ఇలాగ ఏం తినినా ఏం తాగినా మాటిమాటికి గొడవ చేస్తుంటే ఈ స్నేహాలు ఎలా నిలుస్తాయి. స్నేహితులు లేని జీవితం ఏం జీవితం పాడు జీవితం దేనికి. ఈ భూమి మీద ఉండే ఈ నాలుగు రోజులలోనూ తినడానికి, తాగడానికి కాకపోతే ఇంకెందుకు బతకడం" అంటూ వాదనకు ఉపక్రమించాడు బంతే.

"సరే నడవండి మీ ఇంటికెళ్ళి చావిట్లో కాసేపు కూర్చుందాం" అన్నాడు నారాయణ్.

"సరే అలా అయితే ఇంట్లో నేనున్నట్లే ముసలాడు కర్ర పుచ్చుకుని వెళ్ళగొడతాడు."

"నారాయణ్ చెప్పిన మాట అక్షరాల నిజం.స్నేహితుడంటే వాడు." అన్నాడు లాభే ఇందర్.

"అరే భయ్యా భానో అంటే నీకు ఇంత భయం దేనికి" అంటూ బంతే ప్రసంగాన్ని నారాయణ్ మీదకి మళ్ళించాడు.

"ఆవిడ మాట నిజమే. ఇల్లు, వళ్ళూ గుల్ల అయిపోతుంది. ఎందుకొచ్చిన ఘోష అని అంటుంది." అన్నాడు నారాయణ్ ఏదో ఆలోచిస్తూ.

"ఎందుకొచ్చినది ఇదంతా, పనికిమాలిన వాగుడు. ఇంటి దగ్గర ఏమంతా పదిమంది పిల్లలు పడి ఏడుస్తున్నారని ఇప్పుడు డబ్బు ఆదా చెయ్యాలి. ఇంకా ఒళ్ళు ఇప్పుడు కొత్తగా చెడిపోయేదేముంది. చెడిపోవలసిన దేదో ఎప్పుడో

చెడిపోయింది" అంటూ ఇందర్ నారాయణ్‌కు హితబోధ చేశాడు.

"ఇంతకీ భానో... వయసున్న మళ్ళిపోయిన మునలిది కాదు..." నారాయణ్ ఈ మాటను ఎవరిని ఉద్దేశించి అన్నాడో తెలియదు.

ఇంతలో వాళ్ళంతా నూతి గట్టుకి చేరుకున్నారు.

ముగ్గురూ కలిసి ఎంతో కష్టపడి మోట తిప్పి నూతిలో నుంచి నీళ్ళు పైకి తోడారు.

ఇంక అక్కడ కూర్చుని తాగుడు మొదలెట్టారు.

ఇంకా తాగుతూనే ఉన్నారు. ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ తాగుతున్నారు. తాగుతూ చెప్పుకుంటున్నారు.

"అమ్లీ అనే వాడొకడుండే వాడు..." ఏం జ్ఞాపకమొచ్చిందో ఏమో నారాయణ్ ఇలా అన్నాడు."ఆ అమ్లీ ఇప్పుడు మనలాగే అప్పుడు నూతి గట్టున కూర్చునే వాడు. వాడు అలా కూర్చుని ఉండగానే ఎండెక్కిపోయింది. అబ్బ ఎండొచ్చిందే అనుకున్నాడు."

"సరే ఇక్కడ నుంచి ఈ నూతిని ఆ నీళ్ళలోకి జరుపుదాం" అన్నాడు అమ్లీ.

"అవును అలాగే. భలేగా చెప్పావు" అన్నారు పక్కవాళ్ళు.

"వెంటనే మోపు తెచ్చి నూతికి చుట్టబెట్టి లాగటం మొదలెట్టారు. లాగుతూనే ఉన్నారు. ఇంకా లాగుతూనే ఉన్నారు. వాళ్ళు అలా లాగుతుండగానే సూర్యుడు అస్తమించాడు. ఎండ తగ్గిపోయింది."

"అమ్మయ్య ఆగండాగండి. ఇంక లాగక్కరలేదు. నుయ్యి నీడలోకి వచ్చేసింది." అన్నాడు అమ్లీ.

"ఆ విధంగా నీడకొచ్చేసిన నూతిని చూసి అంతా ఎంతో సంతోషించారు." అంటూ నారాయణ్ కథ ముగించాడు. మిగతా ముగ్గురూ సీసా పూర్తిగా ఒంపేసి అందులో మందంతా పట్టేసి నవ్వడం మొదలెట్టారు.

ఇంతకీ ఎవరో తిన్నగా నూతివైపే వస్తున్నట్టు అనిపించింది. వచ్చేది ఎవరా అని ముగ్గురూ అటుకేసే చూస్తున్నారు.

"ఎవరయ్యా అది?" అని అంతకంతకు దగ్గరవుతూన్న ఆ కొత్తవాడిని అడిగాడు నారాయణ్.

"నేనూ జాగర్‌ని! మీరు ఇక్కడున్నారా నేను మీకోసం అక్కడ ఇంటి దగ్గర వెతుక్కుంటేనూ."

"నువ్వు ఒక్క నిముషం ముందొచ్చినా బాగుండిపోను. మేమంతా ఇప్పుడే ముగించి కూర్చున్నాం" అన్నాడు నారాయణ్.

"ఆ ముగించడం మాట అటుంచు అది అలా ఉండనీ. నేనిప్పుడు నీతో ముఖ్యమైన విషయం మాట్లాడదామని వచ్చాను."

"అయితే చెప్పు మరి."

"అబ్బే రహస్యంగా మాట్లాడాలి."

"కొంపదీసి భానోని ఎవడో ఎత్తుకుని పోలేదు కదా. లేకపోతే అంత రహస్యమైన విషయం మరోటి ఏముంది" అని వేళాకోళమాడాడు బంతే.

అయితే పద అంటూ నారాయణ్ జాగర్‌తో కలిసి ఊరు ముఖం పట్టాడు. కొంతసేపు ఇద్దరిలో ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. నిశ్శబ్దంగా నడుస్తూనే ఉన్నారు.

"ఇంతకీ అసలు విషయమేమిటి?" అన్నాడు నారాయణ్.

"నారాయణ్ ఏం చెప్పమంటావు. నీ పెళ్ళాం ఒట్టి పనికిమాలిన ససారా."

నారాయణ్‌కి కాళ్ళ కింద భూమి కదలి పోతున్నట్లనిపించింది.

"ఇంతకీ ఏమయిందట." అని మళ్ళీ అడిగాడు, ఆదుర్దాగా.

"జరగడానికి ఏముందిలే నేను అనుకున్నాను కదా నువ్వు ఇంట్లోనే ఉండి ఉంటావు ఇద్దరూ కలిసి రెండు చుక్కలు చుక్కేసుకోవచ్చని అనుకున్నాను. అనుకుని అటుకేసి వెళ్ళాను. ఇవేళే పట్టుకొచ్చాను ఆ మందుసీసా కొత్తది."

"ఒరేయ్ జాగర్ అడ్డమైన వాళ్ళని ఇంట్లోకి తెస్తున్నానని భానో రోజూ గొడవ చేస్తోంది. ఇవేళ మన దుకాణం నూతి గట్టున తెరుద్దామనుకుని అంతా ఇటుకేసి వచ్చాము."

"నీకేం చెప్పను ఎలా చెప్పను. నువ్వేమో ఇంటి దగ్గర లేవాయె అందికదా జాగర్ ఫోంచేసిపో అని. తొందరేమొచ్చింది అన్నాను. నువ్వు కూడా రానీయ్ ఇద్దరం అప్పుడే కలిసి తింటాములే అన్నాను."

"జాగర్ అవటానికి భానో స్వభావం చాలా మంచిది."

"ఏమంచయ్యా ఏడమంచి, నువ్వొట్టి అమాయకుడివి. నేను చెప్పకుండా

ఉందామనుకున్నాను. మళ్ళీ ఆలోచించాను. ఆ పాపిష్టిది మళ్ళీ నీకేం చెప్పి పెడుతుందో. నేనే చెప్పేయడం మంచిదనుకున్నాను. లేకపోతే అన్నదమ్ముల మధ్యే కలతలు పెట్టేయగలరు వీళ్ళు. ఈ ఆడాళ్ళ సంగతి ఎవరికీ అంతుపట్టదు." అన్నాడు జాగర్ ఊరివైపు గబగబా అంగలేసుకుంటూ వెళుతున్న నారాయణ్‌తో.

కాని నారాయణ్‌కు అదేం వినపడినట్లు లేదు. " నీ దగ్గిర కొంచెం సారాయి దొరుకుతుందా?" అని అడిగాడు జాగర్‌ని. జాగర్ బొడ్లోనుంచి తీసి నారాయణ్‌కు ఇచ్చాడు.

"సాయంత్రం వదిన మాటలు వింటూంటే మత్తు అంతా దిగిపోయింది. అందుకని ఇంకెవరినో అడిగి ఇంకెవరినో అడిగి ఇంకొంచెం మళ్ళీ తెచ్చాను." నారాయణ్ ఒక్క గుక్కలో సీసా అంతా ఖాళీ చేసాడు. ఖాళీసీసా నేలకేసి విసిరి కొట్టాడు.

"ఇంకెవరితోనైనా చెప్పుకుంటే మనకే అప్రతిష్ఠ. సిగ్గుచేటుగా వుంటుంది." నారాయణ్ ఇంటికి వెళ్లడానికి వసారా లోనుంచి బయటకి వస్తూ అన్నాడు.

చిత్తుగా తాగేసి నారాయణ్ ఇంట్లోకి కోపంగా అడుగు పెట్టాడు. తలుపు ధభేలున మూసి లోపల చప్పుడు చేస్తూ గొళ్ళెం పెట్టాడు.

భానో పాలు కాస్తోంది.

నారాయణ్ అక్కడ పడివున్న ముళ్లగట్టు కంచి తీశాడు. దయా దాక్షిణ్యాలు లేకుండా భానోని బాదటం మొదలెట్టాడు.

పాపం దాని ఒళ్లంతా -వీపంతా, కాళ్లమీద, చేతులమీద పెద్దపెద్ద దెబ్బలు పడుతున్నా నోరెత్తి లేదు. పల్లెత్తు మాట అనలేదు. చూసేందుకు ఈనిపుల్లలాగ గాలిలో తేలిపోతున్నట్లుండే నారాయణ్‌లాటి బక్కవాడికి అంతంత పెద్ద దెబ్బలు కొట్టడానికి రాక్షసబలం ఎక్కడ నుంచి వచ్చిందో ఏమో, దెబ్బలతోటి ఒళ్లు పుండయింది. నారాయణ్ అలా బాదుతునే ఉన్నాడు. మధ్యమధ్య తిట్ల వర్షం కురిపిస్తూనే ఉన్నాడు. బండబూతులు తిట్టేస్తున్నాడు.

వాడు ఎంతకీ మానకపోవటంతో భానో వాడి చేతిలో వున్న ఆ కంచి

గబుక్కున లాక్కుంది. తూలి అక్కడ ఇంకేమైనా కట్ట దొరుకుతుందేమోనని అటూఇటూ వెతకటం మొదలుపెట్టాడు.

భానో పరిగెత్తుకెళ్ళి తలుపు గొళ్ళెం తీసేసింది.

బయట చుట్టూ చిమ్ముకున్న చీకటి మరింత భయంకరంగా ఉంది.

వెళుతూ వెళుతూ ఆగిపోయింది.

"వాడి దగ్గరికే పో" అంటూ నారాయణ్ దాని చేతిలోని కొరడా దొరకపుచ్చుకుని మళ్ళీ రెండు అంటించాడు.

"అరె నారాయణ్ నువ్వేనా?" అంటూ బచని ముందుకి వచ్చింది. ఇంకా కొట్టేవాడేమో కాని ఆమె రావడంతో ఫూరుకోవలసి వచ్చింది.

"ఓరిని ! అప్పుడే చెయ్యి జేసుకోవటం మొదలెట్టావు పెళ్ళాం మీద.నేననుకున్నాను ఈ గొడవ,చప్పుడు ఎక్కడ నుంచి వస్తోంది అని. పాలు ఇవ్వకపోతే గొడ్డుని బాదుతున్నావేమో అనుకున్నాను."

"ఊరుకో తల్లీ. ఈ పాపిష్టి దాని సంగతి నీకేం తెలుసు." నారాయణ్ పళ్ళు పటపటా కొరుకుతూ మళ్ళీ చెయ్యి చేసుకోవడానికి చూస్తున్నాడు.

"ఏమండోయ్. ఇదిగో మిమ్మల్నే ఇలా ఒకసారి వస్తారా" అని బచని వాళ్ళింటాయనను పిలిచింది.

"వీడికి బుద్ధి ఏం చెడిపోయిందో, ఇవాళ వీడికేం వచ్చిందో తెలియడంలేదు. చూశావా ఏ దేవత నెత్తికెక్కిందో ఏమో పాపం దీనిని పట్టుకుని చితకబతక పచ్చడి చేసేస్తున్నాడు."

"ఒసేయ్ ఏమయింది ఏమయింది" అంటూ నంతి అక్కడికి పరిగెత్తుకొచ్చింది.

"చూడు. నారాయణ్ చేసిన ఘనకార్యం ఏమిటో. నువ్వేం తెలియని వాడివా. గెడ్డం, మీసం నెరిసింది. నువ్వేం తెలియని పసివాడవా" అంది బచని గడప మీద కూర్చున్న భానోకేసి చూపిస్తూ.

"వాడు అలా గబగబా పెద్దపెద్ద అంగలేసుకుంటూ దూసుకుని పోతుంటే ఇవేళ ఎవడికో మూడిందని నాకు ముందే అనిపించింది." అంది నంతి భానోతో.

"నీకు పిచ్చెక్కింది నారాయణ్" అన్నాడు భగతూ.

"దీన్ని ఇంటికి తెచ్చిన మరుక్షణం నుంచి కూడ నేను పశ్చాత్తాపంలోనే ఉన్నాను" అన్నాడు నారాయణ్ చెప్పులు విప్పి ఒక మూలకు విసిరేస్తూ.

"ఒరేయ్ నారాయణా ఆడదాన్ని భూదేవిని కొడతారు(ట్రా ఎవరైనా." అంది సంతి భానో కేసి వెడుతూ.

భగతూ నారాయణ్‌ను శాంత పరచి మెల్లిగా హితబోధ చేశాడు. సంతి భానోను ఓదార్చింది.

ఎవళ్ళిళ్ళకు వాళ్ళు వెళ్లిన తరువాత స్వయంగా రొట్టెలను పెట్టుకుని పెద్దపెద్ద ముక్కలు చేసి మింగటం మొదలెట్టాడు.

భానో కుంపటి ముందు కూర్చుని ఏడుస్తూ గుడ్డవేణ్ణీలలో ముంచి కముకు దెబ్బలకి కాపటం పెట్టుకుంటూంది.

రొట్టెలను తినేసి నారాయణ్ వెళ్ళి మంచం మీద పడుకున్నాడు. వాడలా పడుకుని ఎంతసేపు ఆ ఇంటి వాసాలు లెక్కపెట్టాడో.

ఇంతలో వాడికి ఏం అనిపించిందో గాని మంచం మీద పడుకున్న వాడల్లా దిగ్గున లేచి కూర్చున్నాడు. భానోకేసి అదే పనిగా చూస్తున్నాడు. లేచి దాని దగ్గరికెళ్ళి దానిపక్కనే కుంపటికి ఎదురుగా చతికిలబడ్డాడు.

భానో వాడికేసి చూడనేలేదు.

వాడు భానో చేతిలో నుంచి గుడ్డ తీసుకుని తనె స్వయంగా కాచడం మొదలెట్టాడు.

"భానో నాకు ఇవేళ మాచెడ్డ కోపం వచ్చేసింది" అన్నాడు.

భానో కళ్ళవెంట నీళ్ళు టపటపా రాలాయి. కాని ఏమి మాట్లాడలేదు.

"నువ్వెళ్ళి మంచం మీద పడుకో. నేనేమో ఈ గుడ్డతో వేణ్ణీళ్ళు కాపటం పెడతా."

భానో తనకు తానే వూరడించుకుని కాళ్ళూచేతులూ నొప్పి పెడుతున్నా కూడతీసుకుని అలాగే కుంటుకుంటూ మంచం మీదకెళ్ళి పడుకుంది.

నారాయణ్ గుడ్డతో వేడినీళ్ళ కాపటం మొదలెట్టాడు. ఒకటి రెండుసార్లు భానో నెత్తిన చెయ్యి పెట్టి నిమిరాడు కూడా.

భానో కళ్లు ఎత్తి వాడికేసి చూడనేలేదు.

"భానో కోపగించుకోకు.ఇవన్నీ మామూలుగా జరిగే విషయాలే. అందరిళ్ళలోనూ జరిగేదే...విన్నావా ఆ చవట వెధవ ఇంకా ఏమన్నాడో," సగం తనలో తాను గొణుక్కున్నట్లుగా, సగం భానోకి వినపడీ వినపడనట్లుగా అన్నాడు.

"సరేలే ఇంక నువ్వు పడుకో" అంది భానో వాడి చేతిని తోసివేస్తూ.

నారాయణ్ అక్కడ నుంచి లేచివెళ్ళి తన మంచం మీద పడుకున్నాడు. వాడికి రాత్రంతా నిద్రపట్టలేదు.

భానో ఒత్తిగిల్లినప్పుడల్లా 'కుయ్యోమొయ్యో' అంటూ మూలుగుతునే ఉంది.

ఓడిపోయిన నారాయణ్ లేచి కూర్చున్నాడు. చితుకులు మంటచేసి పాలు కాచాడు. అందులో ఒకచుక్క నెయ్యివేసి భానోకిచ్చి తాగమన్నాడు.

"వద్దు. నాకు తాగాలని లేదు." అంది భానో వాడికేసి చూడకుండానే.

"నీకు ఇష్టం లేకపోయినా నేను చెపుతున్నా కనుక నామాట విని కాస్త తాగు" అన్నాడు నారాయణ్ గ్లాసు అందిస్తూ.

భానో గ్లాసు అందుకోనూలేదూ, సమాధానము చెప్పలేదు.

"భానో నీ కాళ్ళకి మొక్కుతాను. నీకు పుణ్యముంటుంది. లేచి కాసిని పాలు తాగు" అంటూ నారాయణ్ ఆమె కాళ్ళవైపు చేతులు జాపాడు.

భానో లేచి గ్లాసు అందుకుంది. రెండు గుక్కలు తాగింది. కాని ఆ పాలు మింగుడు పడలేదు.గొంతుక దిగనేలేదు.

మళ్ళీ ఏడుపు లంకించుకుంది.

నారాయణ్ దాని భుజం మీద చెయ్యేసి వీపు నిమురుతూ,"ఏడవకు ఏడవకు ఊరుకో నా చిట్టినాన్న" అన్నాడు.

చాలా రోజుల వరకు భానో వీధి మొహం చూడనేలేదు. ఎవరిని చూడాలన్నా ఎవరిని పలకరించాలన్నా ఏమిటో మహా సిగ్గు పడిపోయేది.

ఒకటి రెండుసార్లు బచని వచ్చింది.

"మావారు మాత్రం ఏం తక్కువ తిన్నారా. ఆయనోసారి నామీద ఇలాగే చెయ్యి చేసుకున్నాడు.అప్పుడు మా అత్తగారు ఇంకా బతికే ఉంది. ఎప్పుడు వాడి చెవిలో ఏదో నూరిపోస్తూ ఉండేది. రోజు విడిచి రోజూ ఈయన కట్టె

పుచ్చుకుని నావెంట పడేవాడు. ఆ పోరుపడలేక మా అన్నయ్యతో చెప్పాను. ఆరోజు మావాళ్ళు ముగ్గురూ ఎగేసుకొచ్చారు. ఇంతకీ మా చెల్లెలు చేసిన తప్పేమిటి అని నిలదీసి అడిగారు. ఆయన గుడ్లు వెళ్లబెట్టి ఇహి అంటూ నాలి నాలిగా నవ్వటం మొదలెట్టాడు. అంతే. అంతటితో ఆయన చేయ్యి చేసుకోవడం మానేశాడు. మళ్ళీ కఱ్ఱ పుచ్చుకుంటే ఒట్టు" అంది బచని.

భానో అది విని ఏమీ మాట్లాడలేదు.

సంతి ప్రతిరోజూ పనులన్నీ ముగించుకుని దాని దగ్గిర వచ్చి కూర్చునేది.

"నేను చెప్పనా భానో మన సీతో మొగుడు కూడా మొదట్లో ఇలాగే విరుచుకు పడేవాడు.అప్పుడు నేను కోట్లాలో ఉండే ఆయన దగ్గిరనుంచి తాయత్తు తెచ్చి కట్టాను. ఇప్పుడు వాళ్ళవని కొంచెం బాగానే ఉంది. ఎందుకైనా మంచిది సిద్దాంతిగారిని కొంచెం అడిగి చూడు, నువెళ్ళి. ఏదైనా గ్రహం వక్రించిందో ఏమో." అంది సంతి భానోతో.

భానో మధ్యమధ్య అలాగా, అలాగే, సరే అనేది. మధ్యమధ్య మాట్లాడక వూరుకునేది.

రొట్టె అందించి తిరిగివస్తున్న బచనీని దయాలో కలుసుకుంది.

"చెల్లీ ఏం చెప్పను. ఆరోజున నారాయణ్‌ని ఏదైనా దెయ్యము ఆవేశించిందో ఏమో. భానోని చావగొట్టాడు." అంది బచని పావడకు అంటుకున్న పల్లేరు ముళ్ళని పీకుతూ.

"మాబాగా అయింది. అలాంటి వాళ్ళకి అలాగే అవ్వాలి."

"అయినా కుయ్యోమొయ్యో అనలేదు."

"తప్పు ముడ్డి కిందున్న వాళ్ళు నోరెత్తుతారా."

"అసలు సంగతి ఏమిటో దేవుడికే తెలియాలి. మనకెందుకుకొచ్చిన పీడ ఇది."

"నిజమే కాని ఇలాంటివాళ్ళు ఆ దేవుణ్ణి కూడా బుట్టలో వేసుకుంటారు. నేను చెప్పలా దీని ప్రవర్తన అంత మంచిది కాదని. కాకపోతే ఎవడైనా వూరికే చెయ్యి చేసుకుంటాడా."

"అయితే జాగర్ దానింట్లో దూరాడందే సంతి."

"అయితే నివ్వూ విన్నావనమాట నంతి చెప్పే సాదంతా. నరే

జొరబడ్డాడయ్యా అయితే పిలవకుండానే వెళ్ళాడంటావా. వుట్టినే వాడంతటవాడే వెళ్ళాడంటావా. ఇంకెవరింటికి వెళ్ళలేదా. అలాంటి వాళ్ళను లక్షమందిని చూశాము. ఇప్పుడిల్లా మాట్లాడనంత మాత్రాన నెప్పరగత్తెల్లా అయిపోతారా. సిగ్గు మాలింది!"

"లోగుట్టు పెరుమాళ్ళకెఱుక."

"నా ఇద్దరు అన్నదమ్ముల మీద ఒట్టు. మా జాగర్ అలాంటివాడు కాడు."

"పోనిద్దూ దయాలో ఈ రోజుల్లో ఎవరి మనస్సు ఎలాంటిందో ఎవరికి తెలుసు. అంత ఒట్టేసి చెప్పాల్సివస్తే ఆ వేసుకునే ఒట్టేదో నీ మీద వేసుకో, లేకపోతే నీ పిల్లల మీద వేసుకో, నీ మీద వేసుకో. అంతేకాని అందరిమీద వేసి ఎందుకు మాట్లాడతావు."

"బచని నువ్వు ఎన్ని చెవ్పు. మా జాగర్ సంగతి నాకు తెలీదా. అయిదేళ్ళనుంచి చూస్తున్నాను. వాడంతటి సత్యసంధుడు ఇంకొకడు లేడు. ఎప్పుడైనా ఎవరినైనా కన్నెత్తి చూశాడా, పన్నెత్తి పలకరించాడా."

"ఒకవేళ చూశాడే అనుకో అంత ప్రాణం మీదకి వచ్చేదేముంది. వాళ్ళ ముల్లే ఏం పోతుంది?" బచని నవ్వుతూ దయాలో నడుము మీద ఒక దెబ్బవేస్తూ అన్నది.

ఆ చెవుతున్నదేమిటో అర్థం చేసుకోకుండానే దయాలో నవ్వసాగింది.

గుమ్మంలో కూర్చున్న మగాళ్ళను చూడగానే ఇద్దరూ ముసుగేసుకుని మాట్లాడకుండ నడక సాగించారు.

"సోహన్ సింగ్ ఈసారి చలి కాలం వానలు వడకుండానే గడిచిపోయింది." అన్నాడు అక్కడ గుమ్మంలో కూర్చుని త్రాళ్ళు పేనుతున్న ముసలాడొకడు పొగపీలుస్తున్న సోహన్ సింగుతో.

"దేవుడు ఏం చెయ్యదలుచుకున్నాడో ఏమో ఈ పాపిష్ఠి లోకంలో పాపం చాల పెరిగి పోతూంది."

"కలియుగంరా బాబు కలియుగంరా సోహన్ సింగు! పెద్దలు చెప్పిన మాట వూరికే పోతుందా. చూడు చూస్తుండగా సేరు బియ్యం ధర రూపాయి అయింది."

"పోనీ ఆ రూపాయైనా ఎందుకు పనికిరాని చెత్త కాయితం."

"ఆ కాయితం కూడా పూర్వం ఇంగ్లీషు వారు సీమనుంచి తెప్పించేవారు. ఇక్కడ తయారు చేసేవాళ్ళు కారు. తయారు చేస్తేనే ఎక్కడ నేర్చుకుని పోతారేమోనని."

"ఈ తెల్లవాడి తెలివితేటలే తెలివితేటలు. ఈఎలక్ట్రిక్ దీపాలు కూడా తయారు చేసినవేనట."

"ఆ రోజుల్లో అంటే మహాభారత కాలంలో అర్జునుడిలాంటి వాళ్ళు ఆగ్నేయాస్త్రాన్ని, మబ్బుల్లో ఉండే మెరుపుని పట్టుకుని తయారు చేసేవారంటారు. ఆ తరువాత అవి మాయమయి పోయాయట. అవి మేనమామ, మేనల్లుడు కలిసి ప్రయాణం చేస్తే అవి వాళ్ళ నెత్తినే పడతాయట. కృష్ణుడి మేనమామ కంసుడు ఆ పిడుగుని రాతికేసి కొట్టాడట. ఏమిటోనబ్బా ఏ సంగతి ఆ దేవుడికే తెలియాలి." అంటూ భీష్మ ఒక గుక్కలాగి ఆ గొట్టాన్నే సోహన్ సింగుకు అందించాడు.

# 4

పగలు మూడు ఝాములు అయింది.

ఎండ చరచరా జరిగిపోతోంది.

ఎండలో కూర్చుని భానో పిల్లలతో గవ్వలు ఆడుతోంది. సంతి అటుకేసే వస్తోంది.

"ఒసేయ్ భానో నీ తెలివితేటలు ఎక్కడ తగులెట్టాయే. పసివాళ్ళతో నీకీ ఆటలు ఏంటి." అంది సంతి నూలుకండెలున్న బుట్ట తెస్తూ.

"సరే అమ్మా నువ్వు కూడా వచ్చి ఇలా కూర్చో." అంది భానో ఎండలో మంచం వాలుస్తూ.

"ఒసేయ్ నువ్వెవరి పిల్లవే?" అని అడిగింది సంతి అక్కడ ఆడుతున్న వాళ్ళందరిలోకి చిన్నపిల్లను పట్టుకుని.

"నేనా నేనూ జీతోని, ఇందో మనవరాలిని. మీ పిన్నమ్మ దగ్గిర స్వెట్టరు ఎలా అల్లడమో నేర్చుకుందామని వచ్చాను." అంది ఆ పిల్ల ఇనుప సూదిని, వూలు ఉండని చేతిలో తిప్పుతూ.

సంతి మంచం మీద కూలబడి నూలు కండెల్ని సరిచేయడం మొదలెట్టింది. ఆ వూలు సరిగ్గా చుట్టి జీతోకు స్వెట్టరు ఎలా అల్లడమో చాలాసేపు నేర్పింది. మిగతా ఇద్దరు పిల్లలు సంతికేసి చూస్తూ చూస్తూనే ఇళ్ళకి బయలు దేరారు.

"ఒసేయ్ భానో నీవు మీ నాన్నకి ఎవరి ద్వారానైనా క్షేమ సమాచారములు పంపించలేక పోయావా. నీ కబురు కోసం ఆయన అక్కడ ఎదురుచూస్తు ఉంటాడో ఏమో."

"ఏం ఎదురు చూస్తాడులే. ఎక్కడో చచ్చిపడిందిలే అనుకొంటాడు." భానో కాలిపై కొత్త చెప్పు కరవటం వల్ల కలిగిన పొక్కులను చిదుపుతూ అంది.

"భానో నువ్వు ఇంతకీ వాడికి పిసరంతైనా ఏమీ చెప్పలేదా" అంది.

"ఏం చెప్పమంటావు అమ్మా నాబొంద నేను అప్పుడే అనుకున్నాను. నలుగురూ నాలుగు విధాలు నూరిపోస్తుంటే నేను వేరే చెప్పేది ఏముంటుంది. నాకు ఒళ్ళు మండుకొచ్చేది. మనస్సు కుతకుత లాడిపోయేది. నేను అనుకున్నాను కదా నువ్వు ఇంక నాలుగు రోజులుంటావో ఇంకా ఎక్కువే ఉంటావో ఈ అవసాన కాలంలో అంతా చెడగొట్టుకుంటే ఎలాగా అని? అప్పుడంటే మా అన్న రోగంతో తీసుకుంటూండే వాడు.చేసుకున్నంత అనుభవించక తప్పదు,"

"నీ మంచికే ఆలోచిస్తున్నాడేమో నీకేం తెలుసు."

"ఏమో ఆ సంగతి దేవుడికే తెలియాలి. నన్నెవడితోటో పంపించేయడానికి అంతా నిశ్చయమైన తరువాతనే నాకు తెలిసింది. నేను పగలు సుఖపడలేదు. రాత్రీ సుఖపడలేదు. ఎందుకొచ్చిన బ్రతుకు ఇది అని అన్నమానం అనుకుంటూ ఉండేదాన్ని. ఆ రోజుల్లోనే గంగా స్నానానికి వెళ్ళవలసి వచ్చింది. ఇరుగుపొరుగూ అంతా వెళుతున్నారు.నేను అడిగా నాన్నా నేనూ వెళ్ళిరానా అని."

"నేనూ వస్తానన్నాడు ముందుగా. ఆ తరువాత ఏమొచ్చిందో ఏమోగాని మాట్లాడక వూరుకున్నాడు.చివరికి జీవని వాళ్ళతో వెళ్ళు. వాళ్ళతోటే ఉండు. తీర్థంలో ఎక్కడైనా తప్పిపోగలవు జాగ్రత్త" అన్నాడు.

"నేను పైకి ఏమి అనలేదు గాని వెళుతుంటే అనిపించింది. మళ్ళీ ఈ ఊరు చూస్తానో చూడనో."

"అక్కడికి వెళ్ళి గంగలో మునిగి చద్దామనుకొన్నాను. అసలు గంగలో పడి ప్రాణాలు వదిలినవాళ్ళు మనస్సులో ఏం కోరుకుంటే అది పై జన్మలో తప్పకుండా లభిస్తుందని పెద్దలంటారు."

"అవసాన సమయంలో నువ్వు గంగమ్మ తల్లిని ఏం కోరుకోదలిచావో?" అని అడిగింది సంతి. కండెకున్న దారాన్ని ఉండకు చుడుతూ.

"వేరే ఏం కోరుకుంటాను. ఒకసారి సరబన్ నా కంటబడితే చాలు అని కోరుకుందామనుకున్నాను."

"వాడిని అంత మరీ ఇదిగా తలుచుకోకు. పోయినవాళ్ళు ఎప్పుడూ ఎవళ్ళకీ మిత్రులు కారు. మాపుట్టింట్లో కర్మం అని పల్లెది ఒకత్తె ఉండేది.

పాపం దానికి చిన్నతనంలోనే తల చెడింది. మొగుడు పోయిన తరువాత ప్రొద్దున్న, సాయంత్రం ప్రతిరోజూ వాడిని తగలేసిన చోటుకి వెళుతుండేది. వాడి చితాభస్మం తెచ్చుకుందనేవారు. ఆ చచ్చినవాడు దెయ్యమై ఇంట్లో దూరాడు. ముందుగా పాడిగెదె ఉన్న పళంగా చచ్చిపోయింది. తరువాత ముసలిదానికి కళ్ళు కనపడటం మానేశాయ్. దానికి కూడ ప్రతిరోజూ సాయంత్రం ఆ దెయ్యం చీకటి మూలలో కనపడేది. చేసేది ఏమీ లేక చివరికి భూతవైద్యుల్ని పిలిపించారు. వాడు మంత్రం వేసి ప్రతిక్రియ చేశాడు. పహోవాకు వెళ్ళి పూర్తిగా వదిలించుకొచ్చింది. ఇంతచేస్తే చివరికి ఆ దెయ్యం వదిలింది. అందుకనే నేను చెపుతున్నాను భానో విను.చచ్చిన వాళ్ళమీద అంత మమకారం పెంచుకోవడం మంచిది కాదు. పాపం వాళ్ళకి ఈ లోకంలో ఏం మిగిలింది. అలాంటి వాళ్ళు దెయ్యమై తిరుగుతూ ఉంటారు."

"సరబన్ కూడ అలాగే ఏదో ఒకప్పుడు కనీసం అలా కనబడినా చాలు.""

"అయితే అప్పుడు నువ్వు గంగాస్నానానికి వెళ్ళావా" అంటూ సంతి సంభాషణను వెనక్కు మళ్ళించింది.

"ఆ వెళ్ళాను. అక్కడిక్కి చేరిన తరువాత కావాలని జీవనీని వదిలేసి వెనక్కు పడిపోయాను. దాన్ని అలా వదిలేసి తరువాత అన్నిటికన్నా ముందు నేను చేసిన పని ఏమిటంటే కడుపు నిండా హల్వాపూరీ దిట్టంగా దట్టించాను. అవసాన సమయంలో మనిషి మనస్సు దేనిమీద లగ్నమయ్యిందే దాని కోసమే ఆరాటపడుతూ ఉంటాడని అంటారు. మా అమ్మ హల్వాపూరీ చేస్తూ ఉండేది. మా అమ్మ పోయిన తరువాత హల్వాపూరీ మరెప్పుడూ తినలేదు. తరువాత సోడా తాగాను."

"ఒకసారి నేను తీర్థానికి వెళ్ళినప్పుడు సరబన్‌తో కలిసి సోడా తాగాను."

"ఆ రోజున నేను కొత్తచీర కట్టుకున్నాను. సరబన్ పోయినప్పటి నుంచి నేను కొత్తచీర కట్టుకోలేదు."

"ఆ తరువాత గంగ ఒడ్డెంబడే చాలా దూరం వెళ్ళాను. అటూఇటూ ఎవరూ లేకుండా చూసి నేను గంగలో దూకేశాను. అయితే మీ మరిదిగారు అక్కడ ఏ మూలనుంచో నన్ను చూస్తున్నాడన్న సంగతి నాకు తెలియదు."

"ఎవరూ నారాయణ్‌నేనా" అంది సంతి.

"అవును వాడే గొడవ చేసేశాడు. వెంటనే ఇద్దరూ కుర్రాళ్ళు ఆపళంగా

గంగలో దూకి నన్ను నీళ్ళలో నుంచి బయటకు లాగి కాపాడారు."

"ఇంతలో ఎక్కడనుంచి వచ్చారో ఏమో పోలిసు వాళ్ళు కూడ వచ్చారు. నేను భయపడి పోయాను. నువ్వు ఎవరివి ఎందుకు చావాలనుకున్నావు. ఏమిటి నీ కథ. పద పోలీసు స్టేషనుకి అన్నాడు"

"భయంతో బిగుసుకుపోయాను. నోటమాట పెగల్లేదు."

"అతనికి ఎలా తట్టిందో ఏమో ఆ పోలీసు వాళ్ళ చేతిలో రెండు రూపాయలు పెట్టాడు. హవల్‌దార్‌జీ ఇది మా ఇంటి మనిషి కాలుజారి పడింది అన్నాడు.

"ఆ రెండు రూపాయలు పుచ్చుకుని ఆ పోలీసువాడు వెళ్ళిపోయాడు. నారాయణ్ నాతో అన్నాడు కదా. భలేదానివే ఎందుకు దిగావు అసలు. మునిగిపోతే ఏమయ్యేది."

"ఇప్పుడు నాకు ఆ సంగతి తలుచుకుంటే ఎంతో భయం వేస్తుంది. నిజంగా మునిగిపోతే ఏమయ్యేది అని."

"వాడికి ఏం జవాబు చెప్పాలో తెలియలేదు. నాకు ఏడుపు వచ్చింది."

"ఆ కష్టసమయంలో ఎవరికైనా ఏడుపు వస్తుంది" అంది సంతి నూలు విచ్చెలను సరిచేస్తూ.

"ఒకవేళ తెలిస్తే మీవాళ్ళు ఏమంటారు" అన్నాడు.

"ఇంటి దగ్గర నాకు ఎవరున్నారని. ఉంటే ఇక్కడికి ఎందుకిలా వస్తాను."

"అలాగా పాపం. నువ్వూ నాలాంటి దానివే అన్నమాట. సరే అయితే నాతోరా. నువ్వూ నాతోపాటే ఉందువుగాని. నేనేం తింటే అదే తిందువుగాని పద" అన్నాడు.

"అప్పుడు నేను అనుకున్నాను కదా న్యాయంగా గంగాభాయి అనుగ్రహించింది వీడికి, ఇంకా ఆలోచన దేనికి అనుకున్నాను.కాని ఒక్కమాట మాత్రం అడిగాను. మీరు కాపులే కదా అన్నాను."

"కాక మరేమిటి నీ కళ్ళకి మాలవాడిలా కనపడుతున్నానా? అన్నాడు."

"అమ్మా సంతి అంతే, ఈ విధంగా ఈ ఊరువచ్చి పడ్డాను. కాని అప్పుడప్పుడు అనిపిస్తూ ఉంటుంది. ఇలా బతకడం కంటే అప్పుడా విధంగా చచ్చిపోయి ఉంటే బాగుండేదేమోనని" అంది భానో జంభుఖానాకు రెండువైపులా వున్న దారపు పోగులను సరిచేస్తూ.

"అయినా దైవనిర్ణయం ఇలా ఉంటే అప్పుడలా ఎందుకవుతుంది. ఎవరెన్నాళ్ళు బతకాలో అంతా ముందే నిర్ణయమై ఉంటుంది." సంతి ముసుగు సవరించుకుంటూ అంది.

"అయితే ఇంతకీ ఇలా అయి ఏం బాగుపడినట్లు. పుణ్యమా పురుషార్థమా."

"భానో మన చేతిలో ఏముంది చెప్పు? ఎవరింట్లో నీళ్ళూ, తిండి మనకు రుణమున్నాయో అక్కడికి ఏదో వంకతో చేరుకుంటూంటాము. భానో ఏమో ఏం చెప్పగలం నీ కడుపున ఓ కాయకాయాల్సి ఉంది కాబోలు.అందుకే బతికావేమో."

"బాగా చెప్పావు. మీ అమ్మి కూర్చుని లేస్తే లేవలేదు. బిడ్డ కూడానా."

"ఆ మాట నిజమే అనుకో. కాని భగవంతుడి లీలలు ఎవరికి అర్థమవుతాయి. లేకపోతే నువ్వు ఈ ఊళ్ళో ఎందుకు పొతుకుపోతావు. నువ్వు కాస్త నారాయణ్‌ను కనిపెట్టుకుని ఉండు."

"నీకేం మతిపోయిందా ఏమిటి. ఎండిపోయిన మోడు ఎక్కడైనా ఎప్పుడైనా చిగురిస్తుందా? అమ్మి నా ప్రాణాలు తోడేశాడు."

"ఎవరైనా సాధువులు, యోగులూ, మహాత్ములను సేవించు. పిల్లలు లేని ఆడవాళ్ళకు మహాత్ముల ఆశీర్వబలం చేత సంతానం కలిగిందని పురాణాలలోను, కథలలోను చదివాము కదా."

"అయితే ఒకమాట అడగనా."

"సరే అడుగు."

"దెయ్యాలు నిజంగా ఉన్నాయంటావా?"

"ఏమో ఎవడు చూశాడు. అయితే భూతవైద్యుల మాటలు అన్నీ అబద్ధాలే అంటావా. నిజం కాదా."

"అనేకసార్లు నాకు పొద్దుటా సాయంత్రం ఏదో చప్పుడు వినపడుతూ ఉంటుంది. ఏమో మరి నారాయణ్ తాలుకు మునలివాళ్ళు ఎవరైనా దెయ్యమై తిరుగుతూ ఉన్నారేమో."

"నువ్వు అలా అంటే నేనేం చెప్పను. ఈసారైనా తప్పకుండా శార్థం పెట్టు. అయినా పెద్దాళ్ళకి మునలాళ్ళకి ఏవేవో తీరని కోరికలు ఉంటూ ఉంటాయి" అంది సంతి.

భానో ఏమి మాట్లాడలేదు.

"జయ్ సీతారాం, జయ్ సీతారాం." తెల్లటి అంగరఖా, చేతిలో కమండలం, విరబూసుకున్న జుట్టు, చెప్పులేని కాళ్ళతో ఒక సాధువు భానో ఇంటి గుమ్మం ముందుకు వచ్చి కేక వేశాడు.

"వీడికో గుప్పెడు గోధుమ పిండి వెయ్యి. కాపురాలు ఉంటున్న ఇళ్ళనుంచి ఇలాంటి వాళ్ళను ఎప్పుడు వట్టి చేతులతో పంపించకూడదు." అంది సంతి అటుకేసి చూస్తూ.

పిండివేస్తూ భానో ఉలిక్కిపడింది. ఈ సాధువు కూడ మోరావాలీకి వచ్చేవాడు అనుకుంది.

కాని ఆ సాధువుకి ఆ సంగతేం పట్టినట్టు లేదు. పిండి జోలెలో వేయించుకుని జయసీతారాం. జయసీతారాం అంటూ మరో ఇంటికేసి వెళ్ళాడు.

"లే అమ్మా నీడవచ్చింది. మంచం అటుకాస్త ఎండలోకి ఈడుస్తాను." పిండి చేతులు దులుపుకుంటూ తిరిగివచ్చిన భానో అంది.

"చాల్లేమ్మా వెళతానింక. ఇంకా ఇంటి దగ్గఆ గొడవ చాలా ఉంది. వెళ్ళి చూసుకోవాలి. రొట్టె ఇచ్చి వచ్చాను. పొయ్యి మీద పప్పు పడేసి వచ్చాను. ఇంకా ఉప్పు, కారం వెయ్యాలి. నాలుగు విచ్చిలయినా ఉండ చుట్టుదామనుకున్నాను. కాని పనేమి జరగలేదు. చివరికి ఒకటైనా అవుతుందో లేదో. బట్టలన్నీ చిరిగిపోతున్నాయి."

"బస్తీ నుంచి వచ్చేప్పుడు చొక్కాగుడ్డ తప్పకుండా పట్టుకురా. సంతలో కొన్న గుడ్డలు నాలుగు రోజులు కూడ మన్నడం లేదు. సీత పెళ్ళిలో మీ పెద్ద బావగారికి ఓ చొక్కా కుట్టించాలి. ఇప్పటికీ అదే తొడుక్కుంటున్నారు.అక్కడికి ఇక్కడికి వెళ్ళిరావలసి వస్తుంది. నలుగురిలో తిరిగే మనిషి."

"కొంచెం చూడు పేలున్నాయేమో. తల దురదెక్కి పోతుంది." అంటూ సంతి నెత్తిమీది ముసుగు తీసి భానో ముందుకు వచ్చి చూపింది.

భానో దానితల మెల్లిగా పాయలు తీసి వెతకడం మొదలుపెట్టింది. కూనిరాగం తీయసాగింది.

"ఒసేయ్ కాకీ కాకీ ఎగురుతూ ఎగురుతూ వెళుతూ వెళుతూ వెళుతూ మావాళ్ళ ఇంటి దగ్గర కూడ ఒక్క క్షణం ఆగు. నాగోడంతా మా అమ్మతో

చెప్పకు. పాపం ఆవిడ నా బొమ్మలన్నీ చూసిచూసి ఏడుస్తుంది. రాజాలాంటి మా నాన్నకి కూడ ఏమి చెప్పకు. లేకపోతే నడి బజారులోనే ఏడవడం మొదలెడతాడు. మా అక్కకి కూడా ఏమి చెప్పకు. తదియనాడు వెక్కివెక్కి ఏడుస్తుంది. మా వదినతో కూడా ఏమి చెప్పకు. ఆవిడ పుట్టింటికెళ్ళి ఈ కబురు చెబుతూ పగలబడి, విరగబడి నవ్వుతూంది. కాకీ, కాకీ మా తమ్ముడికి మాత్రం తప్పకుండా, మరచిపోకుండా చెప్పు. వాడు నీలిగుఱ్ఱం ఎక్కి పరుగెత్తుకు వస్తాడు. నేనో బలి పశువుని" అంటూ పాడింది.

"భానో నువ్వు ఎంతబాగా పాట పాడతావు. ఏం చెప్పమంటావు భానో కుదురుగా ఎక్కడుండ గలిగితే అక్కడ మంచిది. అప్పుడప్పుడు బగ్గా వచ్చి నా పీకలమీది కూర్చొని ఉంటాడు. వాడు పెళ్ళి చేసుకుందామనుకున్న అమ్మాయి ఓ ముసలాడైన కైలాని పెళ్ళి చేసుకుంది. నాకు సందులో నుంచి వెళ్ళడం అంటేనే దుర్భరంగా ఉంటుంది. చూడగానే లోపల నుంచి కంపరం ఎత్తుకొస్తుంది."

"అంతా ఆ దేవుడి దయ. మనిషేం చేయగలడు. ఇదిగో ఓ పేను దొరికింది" అంటూ భానో ఆ పేను తీసి దాని చేతిలో వేసింది.

"ఇంక పేన్లు ఉన్నట్లు లేవు." భానో లేచి పంపు కింద చేతులు కడుగు కుంటూ అంది. సంతి ముసుగు ముందుకు లాగుకుంది.

"భానో ఇదేమిటే ఈ పీటకి కోడు విరిగిపోయింది?" అని అడిగింది సంతి తొంగి చూస్తూ.

"అవును తల్లీ ఎప్పుడు ఊడిపోయిందో ఏమో బహుశా వాడే విరగకొట్టాడేమో. ఏదో రోజుని కుమ్మరాడి దగ్గర నుంచి కొంచెం మట్టి తెచ్చి దీన్ని అతికిస్తా."

"నువ్వు బాగా చదువుతావని కూడ విన్నానే. ఎప్పుడో ఓనాడు కాస్త వినిపించు తల్లీ. మేము మాత్రం ఇలాగే పశువులకి పేలు కుక్కుతూ గడిపేశాము."

"మా అమ్మ ఎప్పుడు గురుద్వారాకు వెళుతూ ఉండేది. నన్ను కూడ తీసుకెళుతూ ఉండేది. అప్పుడు అక్కడ ఉండే పూజారి తో చెప్పింది. మా అమ్మాయికి కూడా చదవడం కాస్త నేర్పమని. ఆయన రోజూ చెప్పేదంతా విని ఉక్కటబట్టి ఎప్పటికప్పుడు అప్పగించేసే దాన్ని. అదే అప్పుడు

నేర్చుకున్నదే. ఆ చదువుకుంది కాస్త అప్పుడప్పుడు వల్లేస్తూ ఉంటాను. ఏం చెప్పమంటావు. ఏ దేవుడికి కోపం వచ్చిందో ఏమో పుస్తకం చదవాలనే ధ్యాసే లేకుండా పోయింది. అందులో ఏముందని ఆలోచిస్తూ ఉంటాను. ఇప్పుడు దేవుడు దయ తలచి జోలే నింపుతాడా. సరబన్‌కు జబ్బు చేసినపుడు ఎంతగానో వల్లించుకున్నాను. ఎన్ని మొక్కులో మొక్కుకున్నాను. చివరికి ఏమయింది. ఇప్పుడు దేవుడన్న భయభీతులు లేకుండా పోయాయి. నమ్మకం సడలిపోయింది."

"అలా అనకు దైవలీలలు ఎవరికీ ఎరుక. ఏం చూసి ఆనందిస్తాడో తెలియదు."

"అబ్బే ఆనందిస్తే ఆనందించనీ మనదాకా వచ్చినపుడు చూసుకోవచ్చు."

"అదికాదు భానో ఎప్పుడూ దేవుడంటే భయపడుతూ ఉండాలి. సెధా అత్తగారు మంచం పట్టి ఏడాదయింది. తెగతీసుకుంటోంది. చచ్చిందీ కాదు బ్రతికిందీ కాదు. ఓ వైపు పక్షవాతంతో చచ్చేడిపోయింది. నేనెప్పుడూ ఏ జబ్బు తోటి తీసుకోకుండా అనాయాస మరణాన్నే కోరుకుంటూ ఉంటాను."

భానో లేచి పళ్ళెంలో పప్పు పోసుకొచ్చి దాన్ని బాగుచేయటం మొదలెట్టింది.

"అయితే నారాయణ్ మినపప్పు తింటాడన్నమాట? తింటే వాయువు వస్తుందన్నాడే" అన్నది సంతి మంచం మీదనుంచి లేస్తూ.

"నిజం చెప్పాలంటే వాడు మినపప్పు తినడం లేదనాలి. వాడు తినడన్న సంగతి జ్ఞాపకం లేకుండా పోయింది. వండాను కాదు సాయంత్రం ఉట్టి పుణ్యానికి. పెద్ద పోట్లాట అయిపోయేది. ఆ మాటకొస్తే అసలు సరబన్‌కి ఈ పప్పంటే చాల ఇష్టం. నిన్న తిన్నాడో లేదో మళ్ళా రేపే మినపప్పు వండు అనేవాడు."

"అబ్బబ్బ అస్తమానం వాడిపూసెత్తకు. వాడో శత్రువనుకో. వాడి దోవన వాడు వెళ్ళిపోయాడు కదా ఇంకా ఎందుకు వాడి గొడవ" అంటూ సంతి లేచి ఇంటికి బయలుదేరింది.

'వాడో శత్రువు. వాడి దోవన వాడు వెళ్ళిపోయాడు' అనుకుంది భానో తనలోతాను మినపప్పు దాకలో పోస్తూ. రెండో దాకలో నుంచి పెసరపప్పు తీసి బాగుచేయ సాగింది.

# 5

చలికాలం వెళ్ళిపోయింది. ఊళ్ళో జనమంతా బొంతలు, దుప్పట్లు, కంబళ్ళు రజాయిలు అన్నిటిని అటకెక్కించేసారు. శీతాకాలంలో చలికి గజగజా వణుకుతూ ముడుచుకూర్చున్న కుర్రకుంకలందరూ ఇప్పుడు వీధుల్లో హుషారుగా ఎగిరి గంతులేస్తున్నారు.

సందుగొందుల్లో ఉండే మురికి కాలువలన్నీ క్రమంగా ఎండిపోతున్నాయి.

గోధుమచేలు పండి బంగారు వన్నెకు తిరిగాయి. పగలు ఇదివరకటి కంటే పొడిగా ఉంది.

"ఎక్కడైనా పాలికాపుగా చేరి కాస్త కొంద్రను కవులుకు సాగుచేస్తే బాగుంటుందేమో అనుకుంటున్నాను." అంది భాన్ టీ తాగే గిన్నెలు నారాయణ్‌కు దగ్గరగా పెడుతూ.

"మా నాన్న నాలుగు దుకుక్కలు వ్యవసాయం చేసేవాడు. విరగ పండించేవాడు. దాచుకోవడానికి చోటేముంది ఇంకానూ. ఇప్పుడు కాలం మారిపోయింది. ఎవరి కొంద్ర వాడు వదులుకుంటాడు. స్వయంగా చేసేవాడే కాని పాలికాపును పెట్టుకునే వాడెవడు. ఇక నా సంగతి నేను పుట్టినప్పటి నుంచి ఇప్పటి దాకా పొలం తొక్కి ఎరుగను కదా. ఇప్పుడింక వ్యవసాయం ఏం చేస్తాను. అయినా ఎవడి కోసం ఈ తిప్పలన్నీ. మనకెవరున్నారు. ఏ పిల్లాపాప ఏడుస్తారని. ఇప్పుడు ఏ వ్యవసాయం చెయ్యాలి. తినడానికి గింజలు ఎలాగో అలాగ దొరుకుతున్నాయి కదా?"

"పాలికాపుకు మాత్రం ఏం గిడుతుంది? ఈ రోజుల్లో. ప్రపంచంలో దగా, మోసం పెచ్చు పెరిగిపోయింది. పొద్దుగూకిందంటే దొంగల భయం. ఎవడో ఒకడు నాలుగు పనలు ఎత్తుకుపోయి తన చేలో కలిపేసుకోవచ్చు."

"ఆ మాట నిజమే అనుకో. సరే అయితే ముందుగా ఎద్దుల్ని కొనాలి. ఆ తరువాత వ్యవసాయానికి కావలసిన హంగులన్ని అమర్చుకోవాలి. ఆ తరువాత

పాలికాపు పనికోసం అస్తమానం వెంట పడాలి. అయితే ఈ శ్రమంతా దేనికి. మనకు ఇప్పుడు ఏ పిల్ల పెళ్ళికెదిగి కూర్చుందని ఇంత కష్టపడాలి."

"సరేనయ్యా పిల్లపెళ్ళికి లేకపోతే మాత్రం నాలుగు డబ్బులు ఉంటే నలుగురూ పలకరిస్తూ ఉంటారు. లేకపోతే తోడు వచ్చేవాళ్ళే ఉండరు. ఒకవైపు నుంచి ముసలితనం ముంచుకొస్తుంది."

"నారు పోసినవారు నీళ్ళు పొయ్యరా ఏమిటి? అన్నీ చూసుకునే వాడు ఆ దేవుడే ఉన్నాడు. ఇప్పటి దాకా ఇచ్చినవాడు ఇక ముందివ్వడా. రాతిలో కప్పకి కూడా ఆహారం సమకూరుస్తూ ఉంటాడు. ఇచ్చేవాడేమో యిస్తూనే ఉంటాడు. కాని మనం తినేదాన్ని మనమే ముద్దలు చేసి మింగాలి కదా."

"నేనయితే, ఆ ముద్దలేవో నువ్వే పెట్టు అంటాను. నీ చేత్తో నోట్లోకి పెట్టించుకుని తింటాను. నువ్వు ఈ పొద్దు కుడితి తొట్టి అలా బద్దలు కొట్టేస్తున్నావేమిటి?" అంటూ ఆ తొట్టిలో పడ్డ పెంకులను పైకి తీస్తూ ఉన్న భానోతో అతడు అడిగాడు.

"పూర్వులు పాతిపెట్టిన లంకె బిందెలు దొరుకుతాయేమోనని" అంది భానో మేలమాడుతూ.

"మా నాన్న బతికున్నప్పుడు మా బామ్మ పెరట్లోనుంచి వెండి రూపాయిలతో నిండివున్న ఒక గిన్నెని బయటకు తీసింది. దీన్ని ఇక్కడ దాచిపెట్టానని మా అత్తగారు అవసాన సమయంలో చెప్పిపోయింది అంది. కాని ఇప్పుడు ఈ వెధవ కాయితం నోట్లు వచ్చిన తరువాత వీటిని ఇలా దాచిపెట్టడం కుదరదు. అయితే కొంపతీసి నువ్వు దీన్ని నిజంగానే పగలగొడుతున్నావన్న మాట అన్నాడు."

" ఆ ఇదెందుకు పనికి వస్తుంది. దీనిని విరగగొట్టేసి కొత్తది కట్టించాలనుకుంటున్నాను. మాటిమాటికీ మట్టిమెత్తుతూ ఉండటం వల్ల పైపూతంతా రాలడం మొదలెట్టింది."

"అయితే ఇది బాగానే ఉందికదా. అయినా వూరికే కూర్చోవడం నీకు అలవాటు లేదుగా. రెండు గడియలు సేపు కాస్త విశ్రాంతిగా కూర్చో. ఈ ప్రపంచంలో నుంచి ఏం నెత్తిన పెట్టుకుపోవాలి."

"అయితే ఖాళీగా వూరికే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవడం నాకు ఇష్టం ఉండదు. పని చేస్తుంటేనే బాగుంటుంది."

"సరే దానికేమిటి బాగానే ఉంటుంది. పని చేస్తూ ఉండటం మనుష్యుల కర్తవ్యం. కాని రెండు గడియలు విశ్రాంతి తీసుకోవడం కూడా అవసరమే."

"బయటకి వెళ్ళేటప్పుడు ఈ మాసిన బట్టలు ఇచ్చేసిపో. సోడాలో ఉతికేస్తాను."

"ఇప్పుడెందుకూ ఉతకడం. ఇవి బాగానే ఉన్నాయే" అన్నాడు నారాయణ్ తాను ధరించిన దుస్తుల వైపు ఒకసారి ఎగాదిగా చూస్తూ.

"అదేంకాదు. ఇప్పుడు ఉతక్కపోతే ఇంత వరకు వాటికి అంటుకున్న మురికి ఒక పట్టాన వదలదు."

"మురికి ఎక్కడ చేరింది? శుభ్రంగా ఉంటేనూ."

"క్రిందటసారి చొక్కా పూర్తిగా మాసిపోవడమే కాకుండా పేలుకుడా పడ్డాయి."

"అవి బహుశా నీ తల్లోవే అయ్యుంటాయి" అన్నాడు అమ్లీ నవ్వుతూ.

"నేను ప్రతిరోజూ ప్రొద్దునే చన్నీళ్ళతో శుభ్రంగా తలారా స్నానం చేస్తుంటాను. నాతల్లో పేలు ఎక్కడుంటాయి."

"అయితే నీతో ఒక ఇబ్బందుంది."

"ఏమిటో!"

"ఏమిటంటే, నువ్వు పొద్దున్నే లేచి, స్నానం చేసి పారాయణం చేస్తూంటే దేవుడు నిన్ను సరాసరి స్వర్గానికే తీసికెళుతూ వుంటాడు. ఇంక నేనొక్కడిని నరకంలో ఏం చేస్తాను."

"ఇలాంటి తప్పుడు కూతలు కూయకు. వేళాకోళానికైనా."

"పుచ్చకాయలో, పుచ్చకాయలో" అంటూ వీధిలో ఔరేన్ కేక వేసింది.

"భానో ఓ పుచ్చకాయ కొనిపెట్టు" అని బతిమాలాడు నారాయణ్.

"నువ్వేమైనా పసివాడివా?"

"నువ్వు చాలా మంచిదానివికదూ. కొనిపెడుదూ."

భానో చాటనిండా సేరు ధాన్యం పోసుకుని పుచ్చకాయ కొనడానికి వెళ్ళింది.

"ఓ భానో నువ్వా" అంది ఔరేన్ ధాన్యం తక్కెడసిబ్బిలో పోసుకుంటూ.

"అవును" అంది భానో దానికేసి చూడకుండానే.

"నువ్వు బాగున్నావా. ఎక్కడా కనపడటమే మానేశావు."

"నువ్వు ఇవ్వుడు కూడా పుచ్చకాయలు అమ్మడానికి మోరావాలీ వెళుతున్నావా" అని అడిగింది. భానో బెదురుతూ బెదురుతూ.

"ఆ వెళ్ళకేం వెళూతూనే ఉన్నాను."

"వాళ్ళింట్లో అంతా కులాసాగా వున్నారా?"

భానో తన అత్తారింటి యోగక్షేమాలు అడుగుతోందని ఆ పళ్ళమ్మికి అర్థమయింది.

"ఆ ఇంటితో సంబంధాలన్నీ నీకు తెగతెంపులు అయినపుడు వాళ్ళ పొయ్యిలో లేస్తే నీకేం లేవకపోతే నీకేం." అంది పళ్ళమ్మి ఎత్తుకెత్తు పుచ్చకాయలు తూస్తూ.

"అయితే మాత్రం...వాళ్ళు...అవును" అంది భానో తనలో తాను గొణుకున్నట్లుగా.

పుచ్చకాయిలన్నీ భానో తన చెంగులో వేయించుకుంది. ఆ తరువాత ఆ పళ్ళమ్మ ఇంకో చిన్నపండు తీసి భానో కొంగులో పడేసింది.

భానో దానికేసి చూసింది. ఏమి అనకుండా వూరుకుంది.

"కొంచెం తట్ట ఎత్తడానికి ఓ చెయ్యి సాయంచేయి" అంది పళ్ళమ్మ బుట్ట ఎత్తుకుంటూ.

"సరే అలాగే" అంటూ భానో బుట్ట పైకి ఎత్తుకోవడంలో సాయం చేసింది.

భానో అక్కడే నిలబడి వెళ్ళిపోతున్న పళ్ళమ్మకేసి ఒక్క క్షణం సేపు నిదానించి చూసింది. చూపు మార్చుకుని కొంగులో పళ్ళతో ఇంట్లోకి తిరిగి వెళ్ళింది.

ఓ పళ్ళెంలో పుచ్చకాయలూ, దాని పక్కనే కూరలు తరిగే కత్తి నారాయణ్ పక్కనే పెట్టి మట్ట కలపడం మొదలెట్టింది.

"నువ్వు తినవా" అన్నాడు నారాయణ్ పుచ్చకాయలు ముక్కలుగా కోస్తూ.

"వద్దులే నువ్వేతిను."

"ఏం నువ్వు కూడ రా తిందాం."

"వద్దులే. నాకు తినాలని లేదు."

"నీది భలే మనస్సే. ఏమి తినాలని కూడా అనిపించదు."

"ఈసారి మళ్ళీ మనం గంగా స్నానానికి వెళదామా?" అంది భానో ఎక్కడో దూరం నుంచి మాట్లాడుతున్న దానిలా వినపడే పడనట్లుగా.

"క్రిందటిసారి గంగమ్మతల్లి నిన్ను నాకు ఇచ్చింది. ఈసారి తీసుకుపోతే నేనేం చేస్తాను."

"తీసుకోపోదలుచుకుంటే అప్పుడే తీసుకు పోయుండేది. అయినా మనలాంటి పాపిష్ఠి వాళ్ళు ఆవిడకెందుకు."

"ఇంతకీ నువ్వేం పాపం చేశావుట" అన్నాడు నారాయణ్.

"ఏమో పూర్వ జన్మలో ఏదో పాపం చేసే వుంటాను. లేకపోతే..." భానో అర్ధోక్తిలోనే ఆగిపోయింది.

నారాయణ్ ఒక్క క్షణం సేపు దాని ముఖం వైపే చూశాడు. మళ్ళీ ఇంకొక పుచ్చకాయి ముక్కను నోట్లో వేసుకుంటూ అన్నాడు."నీకేమైనా కావాలంటే మొహమాటం లేకుండా అడిగేసెయ్.మొహమాటం అనవసరం. మనం మాత్రం ఇంకెవరికి పెట్టాలి కనుక."

"అప్పుడప్పుడు కర్తారీ ఇంటికి వెళ్ళివస్తూ ఉండు. లేకపోతే వీడిలాంటి తమ్ముడని అనుకోవచ్చు."

"అప్పుడప్పుడు నాకూ వెళ్ళాలనే అనిపిస్తూ ఉంటుంది. ఏం లాభం. ఇంత దూరం వెళతారు. ఎవరు వెళ్ళగలరు. వారు పన్నెండుమైళ్ళ దూరంలో ఉన్నారు. వెళ్ళి రావాలంటే పాతిక రూపాయిలవుతుంది. ఉత్తరప్రదేశ్ అంటే దొడ్డి గుమ్మం అన్నట్లు మాట్లాడతావేంటి."

"ఇంతకీ అన్నాచెల్లెళ్ళ మధ్య రాకపోకలకి పాతిక రూపాయలకి ఎవడు మొహం చూసుకుంటాడు. ఇంక ఎంతమంది ఉన్నారు కనుక. ఉన్నదే వాడొక్కడు. వీడు కాకపోతే ఇంకొకడెవడైనా వెళతారనుకోవడానికి."

"నువ్వు పిచ్చిదానివి. కాకపోతే మరేమిటి? నా సంగతే చూడు. నాకు అమ్మ,అక్క, చెల్లెలు,కూతురు భానోతో సహ అందరూ నువ్వే అనుకుని హాయిగా ఉండటం లేదూ? అలాగే అది కూడ అక్కడున్న పరిస్థితులకి అలవాటు పడిపోయి హాయిగా ఉంటోంది. అసలు వెళ్ళకపోతే అవతలి వాళ్ళు

ఎదురుచూడటమే మానేస్తారు." నారాయణ్ లేచి పుచ్చకాయ ముక్కలని భానోకి అందిస్తూ అన్నాడు.

"అయితే ఎందుకెళ్ళవుట. ఇంతకీ కంఠంలో ప్రాణం ఉన్నంతసేపు ఈ సంబంధాలన్ని తెగతెంపులు చేసుకుని కూర్చోవడం దేనికి."

"సరే నువ్వంతగా పట్టుబడట్టయితే తద్దినానికి వెళ్ళి వస్తాను."

"నీకు తెలుసా ఇంటి ఆడపడుచు బాధ పడితే పునాదులే కదలిపోతాయట."

"అలా అయితే మీ ఇంటికి భూకంపం వచ్చి ఉండాలే."

"దేనికట!"

"దేనికా నువ్వు పొద్దస్తమానం నిట్టూరుస్తూ ఉండటం నేను గమనిస్తూనే ఉన్నాను కదా!"

"చూడు. నేనెక్కడ నిట్టూరుస్తున్నాను." అంది భానో వట్టిగడ్డి పరకలు కలిపి చేసిన మట్టిముద్దల్ని బెల్లూడిపోయిన గోడకి మెత్తుతూ.

ఇంతలో ఒక దూడ వచ్చి పిండి పట్టించడం కోసం కడిగి ఎండబెట్టిన గోధుమల్ని మేయడం మొదలెట్టింది.

"ఈ దెయ్యం పొద్దున్నుంచి నెత్తురు తాగుతుంది. ప్రాణాలు తోడేస్తుంది" భానో ఆ మట్టి చేతులతోటే దాన్ని అదిలించింది.

దూడ సందులోకి పారిపోయి నిలబడింది. మళ్ళీ ఇటుకేసి రావటానికి చూస్తుంది.

భానో దాన్ని దూరంగా తరమడానికి వెళ్ళింది. చాలా దూరం తరుముకుంది వెళ్ళివెళ్ళి సందులో నుంచి గెంతి నాలుగు వీధుల మొగలో వచ్చి నిలబడింది.ధనేకపుర్ గడ్డిమోపుతో ఎదురయింది.

"ఒసేయ్ భానో అదేమిటే ఇవాళ నీకు ఏమొచ్చిందే అలా ముసుగు తీసేసి సందులో పడి గంతులేస్తున్నావు? ఇది నీ పుట్టిల్లనుకున్నావా? ఇష్టమొచ్చినట్లు వేషాలెయ్యటానికి?"

అయితే భానో ఈ మాటలేవి పట్టించుకున్నట్లు లేదు.

"అమ్మా దణ్ణం" అంటూ పాదాలు తాకింది.

"చిరంజీవ, చిరంజీవ. దేవుడు నిన్ను చల్లగా చూడాలి. నేననుకున్నాను

కదా ఆడాళ్ళకి ఘోషా అక్కరలేదని. సింధ్ సభవాళ్ళ మతాలో చేరిపోయావేమోనని."

"దూడని తరుముకొచ్చాను. అమ్మా అది మరపట్టించడం కోసం ఆరబెట్టిన గోధుమలను మేసేయడం మొదలెట్టింది. దాన్ని తరుముతూ తరుముతూ పరధ్యానంగా అలా వచ్చేసాను."

"మరేం ఫరవాలేదు. నాలుగయిదు మాసాలు అయిపోతే నువ్వు ఈ ఊరికి అలవాటు పడిపోతావు. అప్పుడు అన్ని సంగతులు నీకే తెలుస్తుంది."

భానోకు ఈ మాట కూడ అర్ధమయినట్లు లేదు.

మాటమారుస్తూ అంది సంతి, "అమ్మా భీభీని నిన్న పంపించేశావా."

"అవును. అది వెళ్ళింది నేనింకా రెండు నెలలు ఉండు అన్నాను. ఈలోగా మరో రెండు గేదెలకు బేరం పెట్టాను. పచ్చి బాలింతరాలివి. ఇంకో రెండు నెలలు పోతే ఒంట్లో కాస్త బలం పుంజుకుంటుంది. అక్కడ కూడ దేవుడి దయవల్ల మందిమార్బలం చాలా ఎక్కువే. పని కూడ ఎక్కువే. చాకిరీ కూడా ఎక్కువే. అక్కడేదో ముంచుకు పోతున్నట్టు తీసికెళ్ళి పోయింది."

"మంచిదే నీ కూతురు నెయ్యి ఇంట్లోనే తయారు చేస్తుంది" అంది భానో. ఆ మాట అంటూనే ఆవిడ సిగ్గుతో ముడుచుకుపోయింది. ఇంతలో పశువులకు గడ్డికోసుకుని రావడం కోసం కొడవలి, కత్తి పట్టుకెళుతున్న లాభే కొడుకు ఇందర్ భానోని చూసి కన్ను గీటాడు.

"పోకిరి వెధవా" అనుకుంది భానో మనస్సులో. వాడి పక్కనుంచి రివ్వున దూసుకుపోయింది.

అలా వడివడిగా పోతున్నప్పుడు కాలికి ఎదురు దెబ్బ గట్టిగా తగిలింది. బొటనవేలి గోరు వూడి పోయింది. నెత్తురు చిమ్మింది.

అయినా లెక్కచేయకుండ భానో ఇల్లు చేరుకుంది.

లాభే కొడుకు ఇందర్ ఇవాళ నన్ను చూసి కన్నుకొట్టాడని నారాయణ్‌తో చెప్పుదామా అనుకుంది. భలేదానివే చెబితే వాడు మాత్రం ఏం చేస్తాడు అని అంతరాత్మ ప్రభోదించింది.

ఇంటికొచ్చి మళ్ళీ గోడకి మట్టి మెత్తడం మొదలెట్టింది. రేపటికి

శుభ్రంగా ఆరిపోతుంది. అనుకుంటూ సూర్యాస్తమయం అయ్యేంత వరకు మట్టిమెత్తుతునే ఉంది.

మెత్తడం పూర్తిచేసి మట్టి చేతులను కడుక్కుంది.

అడ్డిగ లోనుంచి పప్పు తీసి దంచింది.

గోధుమ పిండి కలిపింది.

పాలు కాచింది.

రొట్టె చేద్దామని పెనం కాలేసింది. ఇంతలో జ్ఞాపకమొచ్చింది. బట్టలు ఉతకడానికి నూతి దగ్గిరకు వెళ్ళినపుడు నారాయణ్ తలగుడ్డ అక్కడే మరిచిపోయానని. ఒకవేళ గట్టుకు అటు పక్క పడిపోయిందేమో. ఎదురుగానే పడినట్లయితే తప్పకుండా కనపడేది కదా అనుకుంది.

ఒకవేళ ఎవడైనా ఎత్తుకుపోయాడేమో. ఇంతవరకు ఎవరూ తీసికెళ్ళక పోయినట్లయితే తెల్లారే లోపుగానే ఎవరో ఒకరు కాజేస్తారు.

ఇప్పుడు వెళ్ళి తీసుకురావడమే మంచిది. పొద్దుపోతే మరీ చీకటిపడి పోతుంది అని అనుకుంటూ భానో పొయ్యిలో ఉన్న కట్టల్ని బయటికి తీసి మంట తగ్గించింది. కలిపిన పిండి మీద మూకుడు బోర్లించింది. ముసుకేసుకుంది. తలుపు మూసి నూతికేసి బయలుదేరింది.

సత్రం వెనకాల ఉన్న చిన్న చెఱువు దగ్గఱకి వచ్చేసరికి తనని ఎవరో వెంబడిస్తున్నట్లు అనుమానం వేసింది.

వెనుతిరిగి చూసింది. కాని చీకట్లో ఏమీ కనపడలేదు.

చిన్న చెఱువు గట్టు దాటి స్మశానం పక్కనుంచే నుయ్యివైపు మళ్ళింది.

నూతి గట్టుకి అటువైపు పడిఉన్న నారాయణ్ తలగుడ్డను తీసికొని వెనక్కి తిరిగింది. ఇంతలో ఎవరో దగ్గారు. భాను గుండె ఝల్లుమంది.

"ఎవరూ లేరు వదినా నేనే" అన్నాడు జాగర్ తనవైపు వస్తూ.

భానో బెదురుతూ అటూఇటూ చూసింది.

"భయపడకు వదినా ఆవుతోడు నేను నిన్నేమీ అనను."

భానో మౌనంగా నిలబడి పోయింది.

"ఇప్పటికి ఇంకా కోపం పోలేదా?"

భానో ఏమి మాట్లాడలేదు.

"నీమీద ఒట్టు వదినా. నారాయణ్ నీమీద చేయి చేసుకున్నాడని విన్నప్పుడు వాడి ఎముకలు పచ్చడి చేసేద్దామనుకున్నాను."

"కావాలంటే చంపి పారేయ్. అంతేకాని నామీద మాత్రం కోపగించుకోకు" అన్నాడు జాగర్ మరింత చేరువుగా వచ్చి.

"జాగర్ నువ్వు సరబన్‌కి కొడుకులాంటి వాడివి కదూ" అంది భానో హేళనగా.

"అందుకే కదా నిన్ను అంత జాగ్రత్తగా చూసుకుంటున్నది. నిజంగా దేవుడి సాక్షిగా చెప్తున్నాను విను. కావాలంటే నీకోసం ప్రాణాలైనా వదిలేస్తాను."

"అవును ఆ మాటే చెప్పుకోవాలి. చాలుచాలు. నీ కబుర్లింక చాలించు. దేవుడి దయవల్ల అలాంటి అవసరం రాకూడదు."

"నువ్వు ఒక్కమాట అనిచూడు. నేను ప్రాణాలు ఇవ్వకపోతే అప్పుడను."

"ఆ నాకు నీ సంగతి బాగా తెలుసు."

"నువ్వు నిజం ఒక పట్టాన ఒప్పుకుంటావా. మొదట నిన్నుచూసినపుడే."

"నేనిలా అంటున్నానని ఏమి అనుకోకు. ఇప్పుడు నీ."

"నువ్వు తాగి వచ్చినట్టున్నావు."

"నిన్ను చూడగానే ఆ మత్తుకాస్త దిగిపోయింది. ఎప్పటినుంచో ఎదురు చూస్తున్నా ఎక్కడైనా నువ్వు ఒంటరిగా కనవడతావేమో. కాస్త మాట్లాడదామని."

"ఫూ, మాట్లాడతాను. మరే" అంది భానో కసురుకుంటున్నట్లు అడుగు ముందుకేస్తూ.

"అహ. అలా వెళ్ళిపోకు మరీ. కాస్త మాట్లాడి వెళ్ళు." అంటూ జాగర్ భానో ముందుకి వెళ్ళి అడ్డంగా నిలబడ్డాడు.

"అయితే చెప్పుమరి" అంది భానో విసుగ్గా.

"అయితే పద. ఎక్కడికైనా పారిపోదాం పద."

"జాగర్ నీకు మతిపోయిందా."

"ఇదేం వేళాకోళం అనుకున్నావా. ఇంకెప్పుడు ఇలా మాట్లాడకు" అంది భానో మధ్యలోనే వాడి మాటలను త్రుంచేస్తూ.

"వేళాకోళం ఆడుతున్నది ఎవరు వదినా. మా చిన్నాయన కొడుకొకడు బొంబాయిలో లారీ నడుపుతుంటాడు. వాడి దగ్గరికి పోదాం. ఎవరికి తెలుస్తుంది."

"వద్దు జాగర్ వద్దు. నన్ను అలాంటిలాంటి ఛిల్లరదాన్నని అనుకున్నట్లున్నావు" అంది భానో దీనంగా.

"అలాంటిలాంటి చిల్లరమల్లర ఆడాళ్ళ కోసం ఇల్లూవాకిలి ఎవడు వదులుకుంటాడు. నాకు నువ్వంటే నిజంగా మోహం కలిగింది."

"అబద్ధం అయితే ఊరునుంచి పోయేది శవమే" అంది భానో ధృడ స్వరంతో.

"సరే అయితే నీ ఇష్టం. ఇక్కడున్నంత కాలం కోపంతో మాత్రం ఉండకు."

"నాకెవరి మీద మాత్రం ఎందుకు కోపం జాగర్."

"నువ్వు కోరినట్లయితే ఇప్పుడే నూతిలోకి దూకుతాను. అలా దూకకపోతే నేను రైతుబిడ్డను కాను. పాకీవాడి కొడుకుననుకో."

"అయితే ఎందుకుట దూకటం."

"నీకు నామీద కోపం కదా. అందుకని."

భానో ఏమి మాట్లాడలేదు.

"నీకే గనక కోపం లేకపోయినట్లయితే ఒక మాట ఇప్పుడు అడుగుదామనుకుంటున్నాను. ఇలా మళ్ళీ ఒంటరిగా ఎప్పుడు, ఎక్కడ తారసపడతామో తెలీదు కనుక."

"అయితే అడుగు" అంది భానో అడుగు ముందుకి వేయబోతూ.

"అయితే ఈ ప్రపంచం నుంచి ఇలా నిష్క్రమించ వలసిందేనా."

భానో ఏమీ జవాబు చెప్పలేదు.

"అయితే నీకు పిల్లాపాప ఎవరూ అక్కరలేదా" అన్నాడు జాగర్ మెల్లిగా భానో చెయ్యి పట్టుకుంటూ.

వెంటనే వాడి చేతులు చుట్టవేసి ఏడవాలనిపించింది భానోకి. జాగర్ చేతిలో ఉన్న తన చేతిని వూడపెరుక్కోలేదు.

"ఆ అమ్మి గాడి కోసం నువ్విలా ఈ ప్రపంచం నుంచి వట్టి చేతులతో పోవడం దేనికి. వాడు ఒకవేళ రేపు చస్తే నీ వాళ్ళు అనుకోవడానికి ఎవరున్నారు" అన్నాడు జాగర్ ఆమెను తనవైపుకు లాక్కుంటూ.

"వద్దువద్దు జాగర్" అంటూ భానో తన చేతులను విడిపించుకుని వెనక్కు తోసేసింది.

"సరే అయితే నీ ఇష్టం. అయినా అప్పుడప్పుడు కలుసుకుంటూ ఉండు. ఈ ప్రపంచం నుంచి చచ్చేటప్పుడు వెంట వచ్చేదేముంది" అన్నాడు జాగర్ నిట్టూరుస్తూ.

"సరేలే" అంది భానో నీరసంగా.

"సరబన్ మీద ఒట్టేసి చెప్పు. నువ్వు రేపు సాయంత్రం ఇక్కడికీ వచ్చికలుసుకుంటావని."

"సరబన్ మీద ఒట్టా" అంది భానో ఉలిక్కిపడి

"మనకీ ఒక ధర్మం ఉంది. నీ ఇష్టం లేకుండా నిన్ను వేలేసి ముట్టుకోను. కాని కలుసుకుంటూ ఉండు."

"సరే అయితే" అంది కంగారుగా భానో.

"అయితే ఒట్టేసి చెప్పు. నువ్వు ఒట్టేయకపోతే నేను వెళ్ళను."

"సరే అయితే ఒట్టు."

"సరబన్ మీద ఒట్టేనా."

"అవును."

ఆ చీకట్లో గొప్పులు ఎన్ని తగులుతున్నా దారి వెతుక్కుంటూ ఇంటికి వస్తూ భానో దోవ పొడుగునా ఆలోచిస్తూనే ఉంది. నేను సరబన్ మీద ఈ దొంగ ఒట్టు ఎందుకేశానా అని తనలో తాను తర్కించుకుంది

# 6

పొద్దుగూకుతుంది.

ఆకాశం మేఘావృతమయింది. అన్ని వైపుల నుంచి మేఘాలు దట్టంగా కమ్ముకుంటున్నాయి.

అక్కడక్కడా వాన చినుకులు పడటం వలన తడిసిన మట్టివాసన వస్తోంది.

తడుస్తూ తడుస్తూ వస్తున్న సంధ్య.

భానో కుంపటి ముందు కూర్చుని రొట్టెలు చేస్తోంది.

క్షణక్షణానికి వచ్చిపోతున్న గాలి విసురుకుని కుంపటిలో వేసిన తడిపిడకలు ఒక్కొక్కసారి కణకణలాడుతున్నాయి. మరోసారి నివురుగప్పుకు పోతున్నాయి.

పిండి అరిపోయింది.

అది చూసి బహుశ చుట్టాలెవరైనా వస్తారేమో అనుకుంది భానో.

"అయినా మనింటికి వచ్చేవాళ్ళెవరబ్బా" అని ఆలోచించటం మొదలెట్టింది.

అది ఇంకా అలా అనుకుంటూ ఉండగానే కర్తారీ చేతిలో సంచితో లోపలికి వచ్చింది.

ఆవిడకి నారాయణ్‌కు చాలా పోలికలున్నాయి. అయితే అన్నపానాదులకు లోటులేని శ్రీమంతుల ఇంటి స్త్రీవలె ఆమె ముఖం కళకళలాడింది. ఆమె పువ్వులద్దిన పైజామా, తెల్లని నైలాను కమీజు ధరించింది. పైన పువ్వుల ఓణీ వేసుకుంది.

భానోకేసి చూస్తూ ఒక్కక్షణం ఆగిపోయింది.

గుమ్మం దగ్గిర చెప్పులు విడిచింది. చేతిలో సంచి అక్కడున్న పెట్టెమీద

పెట్టింది. భానోవి పలకరించింది. "ఇంతకీ నువ్వెవరివి. ఇదివరకెప్పుడూ నిన్ను చూసినట్లు లేదే" అంది.

"నేను భానోవి" అంటూ ఆ వచ్చినావిడ మొహంలో నారాయణ్ పోలికలు గమనించి వెంటనే లేచి పాదాలను తాకి నమస్కరించింది.

"చిరంజీవ, చిరంజీవ. దేవుడు దయవలన నీ ఇల్లు చల్లగా ఉండుగాక. దేవుడు నిన్ను అనుగ్రహించుగాక. దీర్ఘ సుమంగళివై వర్ధిల్లు. శీఘ్రమేవ సుపుత్ర ప్రాప్తిరస్తు. నారాయణ చెప్పినట్లు వింటున్నాడా?"

"ఆ బాగానే ఉన్నారు. అస్తమానం మీ మాట అంటూనే ఉంటారు." భానో గిన్నెలో నుంచి పాలు వంచి అందులో కలకండ వేసి కలిపి కర్తారీ చేతికి అందించింది.

"ఇదెందుకు ఇప్పుడు." అంటూనే కర్తారీ పమిట చెంగుతో ఆ గ్లాసు పట్టుకుని చుక్కచుక్క చొప్పున తాగటం మొదలెట్టింది.

"నేను ఉత్తర్‌ప్రదేశ్‌కు ఏ ముహూర్తాన వెళ్ళానోగాని అప్పటినుంచి మావాళ్ళని కలుసుకోవడమే పడటం లేదు. నారాయణ్ వట్టి సోమరి. ఎప్పుడు ఉత్తరం ముక్కయినా వ్రాయడు. ఎప్పట్నుంచో వద్దామనుకుంటున్నాను. కాని ఇంటి పనులు తెమలక, ఇతరత్రా వీలులేక రాలేకపోయాను. ఇప్పుడైనా ఎలాగో పెగుల్చుకుని వచ్చాను."

"ఇప్పటికైనా మంచి పని చేశారు" అంది భానో కూర కోసం బంగాళదుంపలని చెక్కుతీస్తూ.

"మా బిబోకి గువారాలో సంబంధం కుదిరింది. ఇంక పెళ్ళి చేయాలి. ఇంతకీ ఆ దేశం కాని దేశంలో కొత్తచోట నాకు సాయంచేసే నా అనేవాళ్ళు ఎవరున్నారు. అందుకని పుట్టింటికెళ్ళి అక్కడే ఆ మూడుముళ్ళు వేయించేద్దామనుకుంటున్నాను. ఆయన అంటూనే ఉన్నాడు. లాటమాజర్‌కి వెళ్ళి అక్కడ చేద్దామని నేనన్నానుకదా చుట్టాలందరినీ ఆశ్రయిస్తూ ఎక్కడ పోతామని, మంచో చెడో మా అన్న ఇంట్లోనే చేయడం మంచిదని అన్నాను."

"సంతోషం. సరే అలాగే కాని. ఇలాంటప్పుడు ఆదుకోవడానికి కాకపోతే బంధుమిత్రులు సోదరులు మరి దేనికి" అంది. భానో బంగాళాదుంపల కూరలో తిరగమాత వేస్తూ.

"నువ్వు వనిమంతురాలులావే" ఉన్నావే అంది కర్తారీ ఇల్లంతా కలయజూస్తూ.

భానో ఏమి మాట్లాడలేదు.

"ఇంతకీ నీ పుట్టిల్లు ఏ ఊరు:"

"భడికే కోట్లే" అంది భానో విచారంగా.

"ఫరవాలేదులే మన చేతిలో ఏముంది. గీతలో ఎలా రాసిపెట్టుందో అలా జరుగుతుంది." అంది కర్తారీ దాని బాధను అర్థం చేసుకున్నట్టు.

"కూరలో పాపు పెట్టేసిన తరువాత భానో పంచదారలో పలుకులేరడం మొదలెట్టింది."

"తీపి దేనికి. నేనేమి పరాయిదానినా"

"చూడమ్మా నీవంకని మేము కూడ కాస్త తిందామని."

"నాకు నువ్వున్నావనే సంగతి ముందు తెలిస్తే నీ కోసం కొత్తగుడ్డ కొనుక్కొని వచ్చేదాన్ని కదా!"

"భలేదానివే. ఆడపడుచులకి ఇస్తారా లేక ఎదురుచ్చుకుంటారా."

"ఆడపడచులకి ఎప్పుడూ ఇస్తూనే ఉంటారు జీవితమంతా వాళ్ళ దగ్గఱ నుంచి తీసుకునే అవకాశాలు అరుదుగా వస్తాయి."

"మరేం ఫరవాలేదు. బతికుంంటే చాలా అవకాశాలే వస్తాయి" అంటూ భానో పిండి కలపడం మొదలెట్టింది.

"ఏమైనాకాని మా అన్న ఇల్లు నిలబడింది."

కర్తారీ రాకతో భానులో ఉత్సాహం ఇనుమడించింది.

"అరె ఇవాళ కర్తారీ వచ్చిందే. కాళ్ళకు వంగి దణ్ణం పెట్టాలి" అన్నాడు నారాయణ్.

"చిరంజీవ చిరంజీవ. నీ ఇల్లు చల్లగా వర్ధిల్లాలి. నువ్వు ఇంతవరకెప్పుడూ మా ఊరు రాలేదుగా. అందుకని నేనే వచ్చేశాను స్వయంగా."

"మీ ఊరు రావాలంటే ఎక్కడికే దారి. అక్కడికి చేరేసరికి ఆయువు సగం చెల్లిపోతుంది. దగ్గిరా దాపా. వెళ్ళివెళ్ళి ఆ గెదెల కాపరి దేశంలో పడ్డాము."

"అదేమిట్రా అలా అంటావు. చెల్లెల్ని చూడటానికి అన్నదమ్ములు

అవసరమయితే కొండలు కోనలూ దాటి వెళతారు. అలాంటిది పక్కనున్న ఉత్తరప్రదేశ్‌కి నువ్వు ఇలా అంటే ఎలా."

"అబ్బే ఆయన అలాగే అంటూ ఉంటారు. మేము తప్పకుండా ఈసారి వస్తాము కదా" అంది భానో ఏం జవాబు చెప్పాలో తోచక నిలబడి పోయిన నారాయణ్ కేసి చూస్తూ.

"అలాగే తప్పకుండా రండి. అవతలి వాళ్ళ మొహాన చెప్పుచ్చుకుని కొట్టినట్లు చెపుతాను. నాకూ కావలసిన అన్నదమ్ములు ఉన్నారని."

"కర్తారీకి టీ , ఫలహారాలు ఇచ్చావా?" అని అడిగాడు నారాయణ్ భానో వైపు తిరిగి.

"లేదండీ. ఎక్కడిచ్చాను. ఆ ఇచ్చేదేదో మీ అన్నయ్య వచ్చి ఇస్తాడని చెప్పి కూర్చోపెట్టేశాను" అంది భానో వేళాకోళంగా.

"నాదేముంది. ఈ ఇంట్లో అంతా నువ్వే" అన్నాడు నారాయణ్ కర్తారీ కూర్చున్న మంచం మీదే కూర్చుంటూ.

"అరె నారాయణ్ బాగున్నావా" అడిగింది.

"నాకేం బాగున్నాను. నీ సంగతి చెప్పు. పిల్లా పాపా కులాసాగున్నారా."

"అంతా ఆ దేవుడి దయ. ఇంతకీ నేను ఇప్పుడు ఇక్కడికి ఎందుకు వచ్చానంటే బిబోకి పెళ్ళి. అది నీ ఇంట్లోనే చేయాలని. ఇంకా అయిదువారాలు ఉంది ముహూర్తం. గువారే వాళ్ళ సంబంధం కుదిరింది. పెళ్ళికొడుకు సైన్యంలో పని చేస్తున్నాడు. వాళ్ళ ఇల్లూ వాకిలీ బాగున్నాయి. కుటుంబం కూడ మంచిదే. ఈ సంబంధం హరి తీసుకొచ్చాడు." ఒక్క గుక్కలో కర్తారీ అన్నీ చెప్పేసింది.

"భలేభలే! అయితే మాకందరికి పప్పు అన్నాలు దొరుకుతాయన్నమాటే. మిఠాయిలు తింటామన్నమాట" అన్నాడు నారాయణ్ మూతి తుడుచుకుంటూ.

"బిబో వాళ్ళ నాన్న ఇంక పెళ్ళి పదిరోజులు ఉందనగా వస్తారు. నేను ముందువచ్చి అన్నీ సిద్ధం చేద్దామనుకున్నాను. అక్కడ కూడ ఇల్లు అట్టే రోజులు వదిలి రావడానికి లేదు."

ఆ తరువాత అయిదువారాలు చకచక సాగిపోయాయి. పిండి దంచటంలో, బియ్యం బాగు చెయ్యడంలో, పప్పులు చెరగడంలో, బస్తీకెళ్ళి

రావడంలో, పెళ్ళికూతురికి పెళ్ళిబట్టలు కుట్టించటంలోను, ప్రతిచోటకి వెళ్ళి పనులన్నీ పూర్తి చేసుకుని రావడం లోను, వంచిన తల ఎత్తకోడానికి అయినా ఖాళీ లేకుండా పోయింది.

భానో పాపం పని చేసింది చేసినట్టుగానే ఉంది. ఎంత చేసినా అలుపూ సొలుపూ లేకుండా అలా చేస్తూనే ఉంది. అందరికంటే ఆఖరున పడుకుంటుంది. మళ్ళీ అందరికన్నా ముందు నిద్రలేచింది. కాసేపు ఇక్కడ కాసేపు అక్కడ. రోజస్తమానం అనులో కండెలా అటూఇటూ తిరిగింది. తిరిగింది తిరిగినట్టుగా కాళ్ళు అరిగేటట్లు తిరిగింది. అయినా ఎక్కడా అలసట అనుకోలేదు.

"ఇంతకీ నువ్వు చేసిన సాయమే సాయం. నువ్వుంటూ ఇక్కడ లేకపోతే ఇన్ని విధాల ఇంతగా ఆదుకోకపోతే ఇదంతా నా ఒక్కత్తె వలన అయ్యేదంటావా."

చుట్టాలొచ్చారు. తరువాత మగపెళ్ళివారు వచ్చారు. సప్తపది అయింది. పనులన్నీ భానో ఎంతో చాకచక్యంగా సమర్ధించుకుని వచ్చింది. కొత్త దుస్తులు వేసుకుని గిరగిరా బొంగరంలా తిరిగింది.

అన్నీ సవ్యంగా జరిగిపోయాయి. పెళ్ళి కూతురు అత్తారింటికి వెళ్ళింది. కర్తారీ భానోని మెచ్చుకుంది.

పిల్లని పంపివేసి అక్కడున్న ఆడవాళ్ళందరూ పాటలు పాడుతూ ఉత్సాహంగా గంతులు వేయడం మొదలెట్టారు. అందులో ఒకళ్ళు భానోని బలవంతంగా మధ్యకి ఈడ్చుకొచ్చి నిలబెట్టి అందరితో కలిసి ఎగరమన్నారు.

బాగా అలసిపోయి సొలసిపోయి ఉన్న భానోలో అంత ఉత్సాహం ఎక్కడనుంచి ఎలా పొంగివచ్చిందో మరి. అందరికంటే మిన్నగా భూమి అదిరిపోయేటట్టు గంతులేసింది. ఎప్పటికీ ఆరిపోని మతాబాలా హుషారుగా గంతులేస్తూనే ఉంది.

"ఓ నా ప్రియమైన తండ్రి
నేను కూడ పని చేస్తాను.
అన్నదమ్ముల అందరితో బాటు
పొలంలో హలం ధరించి
వద్దువద్దు నాకు పెళ్ళి చేయవద్దు

నువ్వు తెచ్చిన వరుడు
మంచివాడు కాదని
నేను అనడం లేదు లేదు.
మా మామ చేస్తున్నాడు
కీచురాళ్ళ వ్యాపారం
అందులోనుంచి తెచ్చాడో కీచురాళ్ళ గుంపు
అందులో ఒకటి చచ్చిపోయింది.
అందుకైంది నష్టం
అక్షరాల తొమ్మిది వందల రూపాయలు
అందులో ఒక దానికి పుట్టిందొక పిల్ల
దాని ఫలితంగా కుటుంబం
అంతటికీ కలిగింది
సమష్టి సంక్షేమం తప్పింది
ఆకలికి మలమల మాడి చచ్చే అవకాశం
నేను ఈ కీచురాళ్ళనింటికీ పాలు పిండుతున్నాను
అప్పుడొచ్చాడు రానేదారు
చల్లికావాలంటూ ముంత చేతపెట్టి"
అంటూ భానో గొంతెత్తి మధురంగా పాడింది.

"మా వదిన అస్తానవదంగా దాచుకోవలసిన మనిషి" అంటూ కర్తారీ మాసినప్పుడల్లా పదేపదే మురిసిపోతూ అంటూండేది.

పెళ్ళికొచ్చిన చుట్టాలు ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయారు. కర్తారీ వాళ్ళ కుటుంబం అంతా తిరుగుమొహం పట్టారు.

"వదినా నువ్వు మా ఇంటికి తప్పకుండా రావాలి. నామీద ఒట్టు" అంది వెళ్ళబోయే ముందు కర్తారీ భానోని కౌగిలించుకుని.

"అలాగేనమ్మా తప్పకుండా వస్తాను. అక్కడికి రాక ఇంకెక్కడికి వెళతాను. వెళ్ళడానికి మాకింక ఎవరున్నారని" అంది భానో కర్తారీ కాళ్ళకి దణ్ణం పెడుతూ.

"నీతో నారాయణ్ ఏమి దెబ్బలాడటం లేదు కదా. వాడికి పాపం మనసు మంచిదే. అయితే కాస్త కోపదారి స్వభావం" అంది కర్తారీ వెళ్ళేముందు.

"ఈవిడతో దెబ్బలాడి నేను బతకగలనా" అన్నాడు నారాయణ్ నవ్వుతూ.

"అలాగేలే, బతికుంటే ఈసారి ఇద్దరం వస్తాములే."

"అలాగా తప్పకుండా రండి ఎప్పుడో ఒకప్పుడు. నేను కూడ నావాళ్ళని గురించెప్పుకుంటాను."

"ఎందుకు రాను దేవుడుచల్లగా చూస్తే తప్పకుండా వస్తాము" అని భాను కాలవ గట్టున కర్తారీ దగ్గరనుంచి వీడుకోలు తీసుకుంటూ.

భానో వెళ్ళిపోతున్న కర్తారీ వంక మాటిమాటికి అదేపనిగా చూస్తూనే ఉంది. నారాయణ్ వాళ్ళని స్టేషన్ దాకా సాగనంపడానికి వెళ్ళాడు.

భానో ఇంటికి తిరిగి వచ్చింది.

కర్తారీ కుటుంబం సాగనంపి వచ్చిన తరువాత భానోకి ఇంట్లో అడుగుపెట్ట బుద్ధి కాలేదు. ఇల్లంతా బావురుమంటోంది.

భానో సంతి ఇంటికేసి బయలుదేరింది. వచ్చిన భానోకి కూర్చోమని పీట వాలుస్తూ సంతి అడిగింది "కర్తారీ వాళ్ళు వెళ్ళిపోయారా."

"ఆ వెళ్ళారు. ఎప్పటికైనా వాళ్ళ ఇంటికి వాళ్ళు వెళ్ళక తప్పదు కదా!"

"చెప్పడానికేంలేదుగాని ఒక మాట చెప్పక తప్పదు మీ అమ్మ పేరు నిలబెట్టావు. ఇంత పెద్ద కార్యాన్ని ఎక్కడ ఏ లోటు లేకుండా చక్కగా నిర్వహించుకొచ్చావు. నువ్వు లేకపోతే ఇదంతా ఈ అమలీ కుటుంబంలో వాళ్ళ వల్ల అయ్యే పనేనా?"

"నాదేముంది. అన్నిటికి ఆ దేవుడే ఉన్నాడు. మనం చేసేదేముంది కనుక."

"ఆ మాట సరే దేవుడందరకీ సాయం చేస్తాడు. కాని మేడి పట్టుకుని దుక్కి దున్నే వాళ్ళెవరు?"

"నిజమే అనుకో.అయితే ఆడపిల్లలదేముంది. క్షణంలో పరాయివాళ్ళు అయిపోతారు."

"ఈ ప్రపంచం తీరే ఇంత. ఎవరి చేతుల లోను ఏమి లేదు."

"పెళ్ళినాడు నేను ఏడ్చాను. సరబన్ కూడ ఏడ్చాడు అన్నారు. ఇప్పటికీ వాళ్ళవాళ్ళంతా ఆ మాట చెప్పి మమ్మల్ని వేళాకోళం పట్టించేవారు."

"నువ్వెందుకు అస్తమానం వాడి సంగతే తలుచుకుంటూ ఉంటావు. చచ్చినవాళ్ళ గురించి ఎంత అభిమానం ఒలకబోస్తే ఏమిటి. వాళ్ళు ఎప్పుడైనా వచ్చి పలకరిస్తారాపాడా."

"నువ్వు చెప్పిన మాట నిజమే అనుకో. మరచి పోదామన్నా మరుపు రావటం లేదు."

"ఈసారి పంచమినాడు పాటియాలాకు తీర్థానికి వెళదాం. అక్కడ అలా వరుసగా అయిదు పంచమి తిథులలో స్నానం చేస్తే మనసులోని కోరిక తీరుతుందంటారు."

"ఇంతకీ నాకేం కావాలి. ఏం కోరికలున్నాయి గనుక" అంది భానో మొక్కజొన్న కండెలు కాల్చడానికి కూర్చున్న సంతి దగ్గరనుంచి ఒక కండెను తీసుకుని రెండుగా విరుస్తూ.

"అదేమిటి అలా అంటావు? మళ్ళీ ఏడు మేము తీర్థానికి వచ్చేటప్పుడు ఒళ్ళో పిల్లాడిని పెట్టుకుని రావాలని కోరుకుని వద్దాము. నామాట విను. మంత్రసానికో నరసమ్మకో చూపించుకో."

"మనకి వాళ్ళతో పని ఏమిటి? వాళ్ళు ఏం చెపుతారని?"

"భానో పిల్లలు లేని ఆడదాని జన్మకూడా ఒక జన్మేనా. పుడితేనేం పుట్టకపోతేనేం. వాళ్ళ వలన ఏం ప్రయోజనం ప్రపంచానికి."

"ఈ ప్రపంచంలోనికి ఎలాగూ రానే వచ్చాము. కాని ప్రయోజనం లేకుండా పోయింది."

"ఎవళ్ళ అదృష్టం వాళ్ళది. అంతా వాళ్ళవాళ్ళ అదృష్టం బట్టి ఉంటుంది. చేసుకున్న వారికి చేసినంత మహదేవ అన్నారు. తల్లితండ్రులు పుట్టుకకే కారణభూతులు కాని కర్మకి కాదంటారు."

"ఎప్పుడైనా వాడి కర్మకాలి ఆ దేవుడంటూ కనబడితే వాళ్ళని నిలేసి అడుగుతాను నేనేం పాపం చేసాను. నాకిలాంటి గీత రాసిపెట్టావేమని."

"భలేదానివి. దేవుడెక్కడయినా ఎవరికయినా కనపడతాడా.దొరుకుతాడా. తన గుట్టు ఏమిటో ఆయన ఎప్పుడు ఎవ్వరికీ చెప్పలేదు."

"ఇవ్వన్నీ మనకి మనం నచ్చచెప్పుకునే మాటలు. వాటికేంగాని నీకేం చెయ్యాలని ఉంటే అది చేయి. ఎలా చెయ్యాలనుంటే అలా చెయ్యి."

"భానో నీకు పుణ్యం ఉంటుంది. ఇప్పుడు నీ చేతిలో పనేం లేకపోతే కాస్త నా తల్లో పేలుచూడు తల్లీ చస్తున్నాను." అంటూ తడితల ముడివిప్పుకుని భానో ముందు చతికిలబడింది బచని.

భానో నగం కాలిన మొక్కజొన్న పొత్తిని గిన్నెలో పడేసి చేతులు కడుక్కొని వచ్చి బచని తలలో పేలు చూడటం మొదలెట్టింది.

సంతి అక్కడున్న మొక్కజొన్న కండెలోనుంచి గింజలు వలుస్తూ కూర్చుంది.

"అబ్బే నీ తలలో పేలెక్కడ ఉన్నాయి. ఏమీ లేవు." అంది భానో బచని తలంతా శుభ్రంగా చూసిన తరువాత.

"ఇంతకీ దాని తలలో పేలు చూడాల్సిన అవసరం నీకెమొచ్చింది." అంది సంతి బచని వెళ్ళిపోయిన తరువాత భానోతో.

"ఇందులో ఏముందిలే."

"నీకేం తెలుసు. అదేమో అక్కడ ఎవరి చేతో తాయత్తులు రక్షరేఖలు కట్టించుకుంది. దానికి ఏడునెలలు కడుపు కదా అందుకని."

"ఇంతలో నాకేం రోగం ముంచుకు రావటం లేదు." అంది భానో జిడ్డు చేతులను నేలపై రాస్తూ.

"ఏం రావాలని ఇంతకీ నక్కపుట్టి నాలుగు ఆది వారాలు కాలేదట. ఇంత గాలివాన ఎప్పుడూ చూడలేదందిట. అలాఉంది నీ మాట."

"అదేమిటే అలా అంటావు. ఇప్పటికైనా నామీద దయతలచి ఆ దేవుడు తీసుకుపోతే బాగుంటుంది."

"భలేదానివే. పట్టుమని కోసెడు దూరం లేదు. దాహం దాహం అందిట."

"ఒట్టు. నిజం చెపుతున్నాను. ప్రయాణం అంతా పూర్తయిపోయిందని. ఇంకో అర్ధక్రోసులు మిగిలిపోయి ఉందని అనిపిస్తోంది."

"అప్పుడప్పుడు మనస్సులో విరక్తి పొంగి వస్తూంటుంది. ఆమాట నిజమే. అన్నమానం ఒక వైపునే కాలుస్తున్నట్లయితే రొట్టె కూడ మాడిపోతుంది."

"డోగర్ బతికున్నట్లయితే నాకే బెంగ లేకపోయేది. అప్పుడప్పుడు

మాబాబు సాక్షాత్తు కళ్ళకు కట్టినట్లు కనబడి నువ్వు కూడ నాకు అన్యాయం చేస్తున్నావా అని అడిగినట్లు అనిపిస్తూ ఉంటుంది. పాపం ఎక్కడెక్కడ ఏమేమి అగచాట్లు పడుతున్నాడో తెలియటం లేదు."

"గీత తప్పించటం ఎవరి తరం. రాసినంత అనుభవించక తప్పదు. సంతానం వలన సుఖపడే అదృష్టం వాడికి లేదు."

"దగ్గిర ఉన్నట్లయితే అప్పుడప్పుడు మంచి నీళ్ళయినా పట్టించేదాన్ని. ఇప్పుడు ప్రాణం పోయినా కబురు చెప్పేవాళ్ళు లేరు" అంది భానో గుడ్లనీళ్ళు కుక్కుకుంటూ.

"ఏడవకు, ఏడవకు. ఇంత దుఃఖం దేనికి. నేను చెప్తాలే పెద్దమంగళితో అప్పుడప్పుడూ మీ యోగక్షేమాలు కనుక్కుని వచ్చి చెపుతూ ఉండమని."

"ఎందుకనీ మళ్ళీ కొరివితో తలగోక్కోడం. వాళ్ళ లెక్కలో వాళ్ళకి సంబంధించినంత వరకు నేను చచ్చిపోయిన దానికిందే జమ."

"భానో నువ్వు కూడ నాలాగే మొదటినుంచి కష్టాలే అనుభవించావు."

"అదంతా మన అదృష్టం."

"అవును అంతే. ఇక్కడికి వచ్చి ఈ కథ ముగుస్తుంది. నిన్ను పుట్టించిన ఆదేవుడు లోటేమీ చెయ్యలేదు. వళ్ళు దాచుకోకుండా ఎంత కష్టపడి పనిచేస్తావు. పనంటే భయమే లేదు. తెలివితేటలేం తక్కువ కాదు. కాని ఆ దేవుడు రాతే సరిగ్గా రాయడం మరచిపోయాడు."

"చదువుకోలేదు కదా మరి అందుకని తన ఇష్టమొచ్చినట్లు రాసేసాడు. ఒకవేళ నేనేగాని చదువుకుని ఉన్నట్లయితే అప్పుడే వాడి పీకట్టుకుని అడిగుండే దాన్ని. ఏమయ్యా నేను నీకేం అన్యాయం చేశానని ఇలా రాశావు అని అడిగుండేదాన్ని."

"భానో నువ్వేమి అనుకోకపోతే ఓ మాట అడగనా. ఇలా అడిగానని ఏమి అనుకోకు. ఆ కబురు విన్నప్పటినుంచి నా కడుపు మండిపోతుంది. అసలు నీతో ఏమి చెప్పకూడదనుకున్నాను. కాని నాకు మనస్సుకు శాంతి లేకుండా పోయింది." అంది సంతి చితుకులేరి పొయ్యిలో వేస్తూ.

భానో దాని మొహంకేసి అదోలా చూసింది.

"బిబో పెళ్ళికి హరియా వచ్చాడు కదా. వాడు కర్తారీకి మరిది. వాడికొక మరదలుంది. చాలా కాలమయింది దాన్ని మొగుడు వదిలేసి. అది అందరిని

తప్పులెంచుతూ ఉంటుంది. కాని అదే న్యాయంగా అంత మంచిది కాదని ప్రతీతి. దానికి పెళ్ళయిన తరువాత ఏడోనెల రాకుండానే కొడుకు పుట్టాడట. లోకులు వూరుకుంటారా దాని ఆచూకీ అంతా తీసి గుట్టు రచ్చకెక్కించారు. పాపం ఆ పిల్లాడు పుట్టిన రెండునెలలకే చచ్చాడు. కాని దాన్ని మళ్ళీ ఎవరూ గడప తొక్కనివ్వలేదు. నేను చెప్పనా భానో ఈ హరియాగాడు వస్తే పీడ విరగడవుతుంది అన్నాడు మీ బావగారు, నారాయణ్‌తో ఏవో గునగునలాడుతూ. పైగా అంటాడు భానోకి కూడ అలాంటిదేదో అవ్వాల్సి ఉంటే ఈపాటికి అయ్యే ఉండేది. అప్పుడే రెండేళ్ళయింది కాపురానికొచ్చి. ఆరు వందలలో బేరం కుదిరింది.పచ్చని నీ కాపురం చూసేనరికే వాడి మనస్సు మారిపోయింది. నారాయణ్‌కి ఆ పాలికాపులు పదిమణుగుల ధాన్యం కూడ కొలిచేవారు కారు. ఇప్పుడు నువ్వు వచ్చి అన్ని న్యాయంగా చక్కబెట్టుకుంటుంటే బస్తాలకి బస్తాలు పేరుకుపోతున్నాయి ఇంటినిండా. పైగా నువ్వు వచ్చిన తరువాత నారాయణ్ కాస్త మనిషయ్యాడు. నలుగురిలో తలెత్తి తిరుగుతున్నాడు. మొదట్లో ఎప్పుడూ నిద్రమొహం లాగే ఉండేవాడు. చిత్తుగా తాగేసి మత్తుగా పడుండేవాడు."

భానో ఆశ్చర్యచకితురాలై సంతి మొహంలోకి అలాగే చూస్తుండి పోయింది.

ఇంతలోకి ఏదో జ్ఞాపకం వచ్చినదానిలాగ హఠాత్తుగా లేచి నిలబడింది.

"భానో నీకు పుణ్యముంటుంది. నేను చెప్పినట్టు మాత్రం ఎక్కడా అనకు. నారాయణ్ నా ప్రాణాలు తీసేస్తాడు. పైగా మీ బావగారు కూడ దెబ్బలాడతారు. ఈ మాట ఎలా బయటకి పాక్కిందని. నేను ఉండబట్టలేక చేప్పేసాను."

భానో ఇంటివైపు బయలుదేరింది.

"భానో, ఈ మాటలు ఎక్కడా అనకు సుమా నామీద ఒట్టు" అంది సంతి వెనకనుంచి.

భానో తలుపు తాళం తీసింది. లోపలికెళ్ళి మునుగు తీసేసింది. మంచినీళ్ళు తాగుదామని కుండలో చెంబు ముంచింది. అందులో నీళ్ళు లేవు.

# 7

కొంత కాలానికి మళ్ళీ అదే రోజు వచ్చింది.

నాలుగయిదు సార్లు గేదెలు అరవడంతో నారాయణ్‌కి నిద్ర మెలకువ వచ్చింది.

వాడు లేచేసరికి ఇంకా దీపాలు పెట్టలేదు. టీకి నీళ్ళూ పెట్టలేదు. గేదెల్ని పాలు పిండలేదు. అందుకనే అవి అరుస్తున్నాయి. భానో అలాగే పడుకుని నిద్ర పోతోంది. ఇదివరకెప్పుడూ ఇలా జరగలేదు.

"పెళ్ళి పనులు చేసి పాపం అలసిపోయుంటుంది."

"భానో ఇంక లే పొద్దెక్కిపోయింది" అంటూ భానోను చెయ్యి పట్టుకుని గుంజి లేపాడు.

భానో ఉలిక్కిపడి లేచి కూర్చుంది. హడావుడిగా దీపం వెలిగించింది. పొయ్యి అంటించి దానిమీద టీకి నీళ్ళు పడేసింది. కూర్చుని చల్లచేయడానికి ఉపక్రమించింది.

కవ్వం నాలుగు తిప్పులు తిప్పి నారాయణ్‌తో అంది. "ఈపూట కాస్త మజ్జిగ చిలికి పెట్టకూడదూ. నాచేతులు నొప్పితో పీక్కుపోతున్నాయి."

"చేతులు నొప్పిడుతున్నాయంటే నొప్పెట్టవా మరి పెళ్ళిలో అంతా ఇంతా పని చేశావా. ఏ అత్తగారిని మెప్పించడం కోసం అంతలా కష్టపడ్డావు. సరే ముందు టీ పెట్టేయి. ఒక గుక్కెడు తాగి నాలుగయిదు తిప్పులు తిప్పిపెడతాను."

భానో లేచివెళ్ళి పాలు పితుకుతోంది. గేదె దానికేసి అనేకసార్లు మోర తిప్పి చూసింది. బహుశ మామూలు ప్రకారం నాలుగయిదుసార్లు దాని మోర నిమరకుండా భానో పరధ్యానంగా పాలు పితుకుతోనే ఉందేమోనని. విసిగెత్తిపోయిన గేదె ఒక్క తన్ను తన్నింది. పాలన్నీ ఒలికిపోయాయి. ఇది

చూసి చకితురాలైన భానో అక్కడనుంచి లేచి నిలబడింది.

"నీకేం కళ్ళు మూసుకుపోయాయా పాలన్నీ ఒలకిపోయాయి." అన్నాడు నారాయణ్ మంచం మీదనుంచి లేస్తూ.

ఏదో తప్పు చేసిన దానిలాగా భానో మెల్లిగా పిల్లిలా వచ్చి పొయ్యి దగ్గర చతికిలబడింది. పొయ్యి మీద గిన్నెలో బెల్లం టీపొడుం వేసింది.

నారాయణ్ అక్కడ బట్టలుతికే బడితచేత పుచ్చుకుని గేదెని కాళ్ళమీద గట్టిగా కొట్టాడు.

లేచి వాడిని నివారించడానికి కూడా భానోకు ధైర్యం చాలలేదు.

ఆరోజున వాళ్ళిద్దరూ పాలు లేకుండానే టీ తాగారు.

అలాగే కుంటుతూ కుంటూతూ భానో ఇంటి పనులు ఎలాగో చేసేసింది.

ఆ తరువాత అది నారాయణ్ తల్లి తాలూకు పెట్టె తెరిచి దాని ముందు కూర్చుంది. ఆ పెట్టెలో అద్దకం చేసిన రెండు గుడ్డలున్నాయి. అందులో ఒకటి నీలం తెలుపు గళ్ళతో ఉన్న దుప్పటి ఉంది. రెండు కమీజులు ఒక శాలువా ఉన్నాయి. ఒకపాత ఓణీ కూడా ఉంది. నాలుగు పోచలు పురిపెట్టి పేనిన బొందు కూడ ఉంది. ఒక సంచీ ఉంది. ఆ సంచిలో ఒక తాయెత్తు, ఒక నల్లపూస, ఒక పులిగోరు అన్నీ ఉన్నాయి. బహుశః చంటిపిల్ల మెడలో కట్టడం కోసమని దాచి అట్టేపెట్టినట్లు ఉన్నాయి.

భానో ఆ పెట్టెలో ఉన్న వస్తువులు అన్నిటికేసి తదేక ధ్యానంలో చూస్తునే ఉంది. మళ్ళీ వాటిని యథాపూర్వంగా యథాస్థానంలో పెట్టే మూతేసింది. దానికి తాళం వేసింది. దాని తాళం చెవి మామూలుగా తాళం చెవులుంచుకునే ముంతలో దాచేసింది.

సూది, దారం, పట్టకారు, జల్లెడ, పీట, గెరిట, వగైరా గృహోకరణాలు అమ్మేది కావలసిన వాళ్ళు వచ్చి కొనుక్కోండని అరుస్తూ అటుకేసి వచ్చింది.

"ఇలారా అమ్మి ఇలారా" అని అప్పుడే భానో గుమ్మంలోకి వచ్చిన సంతి ఆ సరుకులు అమ్మేదాన్ని పిలిచింది.

"రామ్మా రా" అంటూ భానో మంచం వాలుస్తూ సంతిని ఆహ్వానించింది.

పిక్కలదాకా నల్లపరికిణీ కట్టుకుని ఉట్టికాళ్ళతో వెండి కడియాలతో పువ్వులద్దిన ఓణి వేసుకుని నెత్తిమీద తట్టతో చేతిలో ఒక పటకారతో ఆ అమ్మి లోపలికి వచ్చింది.

"ఆ గెరిట ఎంతకిస్తావు" అని అడిగింది సంతి.

"రెండు సేర్ల గింజలు కొలిస్తే ఇస్తాను. లేకపోతే రెండు మూడు మణుగులు పుచ్చుకుంటాననుకున్నారా ఏమిటి" అంది ఆ అమ్మి మూట దింపుకుని ఆ గరిటెను సంతికి అందిస్తూ.

"రెండు సేర్లు లేదు. ఐదుసేర్లు లేదు. ధాన్యం ధర ఎలా ఉందో తెలిసి మరీ మాట్లాడు."

"అలా అయితే ఒక గిద్దెడో సోలడో తగ్గించి ఇవ్వండి."

"నేను ఒక సేరు ధాన్యం కొలిచి ఇస్తాను. ఇష్టమయితే ఇయ్యి. లేకపోతే పట్టుకుపో" అంది సంతి తన చేతులోని గెరిటను దానివైపు పడేస్తూ.

"తుని తగువు చేద్దాం. నేను అడిగిన రెండు సేర్లూ వద్దు. నువ్వు చెప్పిన సేరూ వద్దూ. అదీ ఇదీ కలిపి చెరిసగం చేసి సేరున్నర కొలిచి ఇది తీసేసుకో" అంది ఆ అమ్మి.

"అబ్బె అదేం కుదరదు. ఓ సేరు కొలుస్తాను. ఇస్తే ఇయ్యి. లేకపోతే లేదు. పోనీలే సేరుం పావు తీసేసుకో" అంది ఆ అమ్మి గెరిటను సంతి చేతిలో పెడుతూ.

"నేను చెప్పాల్సిన మాటేదో చెప్పేశాను. నాది ఎప్పుడు ఒకటేమాట. సేరు ధాన్యం కొలుస్తాను. ఇస్తే ఈయి లేకపోతే నీలాంటి వాళ్ళు ఎంతమందో వస్తూంటారు. ఎవళ్ళో ఒకళ్ళు ఇయ్యకపోరు."

"సరే తీసుకోమ్మా అలాగయితే నువ్వుకాస్త రొట్టె ఎలాగైనా పెడతావని నాకు తెలుసు."

"దానికేం భాగ్యం రొట్టె పెడతాను. కాసిని మజ్జిగ కూడా ఇస్తాను తాగడానికి." అంటూ సంతి గరిటె చేతపుచ్చుకుని తన ఇంటికి వెళ్ళింది.

తట్ట పైకెత్తి నెత్తినెట్టుకుంటూ ఆ అమ్మి అంది భానోకేసి చూస్తూ. "నువ్వు కూడా ఏదో ఒకటి తీసుకో."

"ఈసారి వచ్చినప్పుడు తీసుకుంటాలే" అంది భానో నవ్వుతూ.

"ఈసారంటావేమిటి. ఎవరుంటారో ఏమో దేవుడికే తెలియాలి. అప్పటిదాకా ఎందుకు. ఆ తీసుకునేదేదో ఇప్పుడే తీసుకో" అంది ఆ గిన్నెలమ్మే అమ్మి.

"వద్దమ్మా వద్దు. ఇప్పుడేమీ అక్కరలేదు."

ఇంతలో స్తంభంపై వాలిన పావురాళ్ళను బెదరగొట్టడానికి చప్పట్లు చరిచి చెదరగొట్టింది. పావురాళ్ళు ఇంటిమీద వాలి కూస్తే ఏదో కీడు మూడుతుందటారు అని జ్ఞాపకం చేసుకుంది భానో.

సాయంత్రం గురుద్వారాకు వెళ్ళింది. చాలాసేపు కూర్చుని బాణీ వింది. తర్వాత గురుద్వారా అంతా తుడిచి శుభ్రం చేసింది. అక్కడ చెఱువు లో నుంచి చేదలనిండా నీళ్ళు తెచ్చి మొక్కలన్నింటికీ పోసంది.

"మా ఇల్లు కూడ కాస్త చిమ్మి పెట్టు." అన్నాడు పూజారి గురుద్వారా నుంచి బయటకు వెడుతూ. ప్రసాదం అందించాడు.

వాడికేసి చూడకుండానే ప్రసాదం తీసుకుంటూ "అలాగే లెండి బాబూ" అంది భానో.

"నా అభిప్రాయం నువ్వు పెళ్ళిపనులన్నీ చేసిచేసి అలసిపోయావని." అంది బచని భానోని చూసి తన ముందు పెరట్లోకి వస్తూ.

"బచనీ నాకు ఒంట్లో బాగాలేదు. ఒళ్ళంతా మంటలు ఏమైందో తెలియదు." భానో కొత్త చెప్పులు కరవడంతో కుంటుకుంటూ అంది.

"నాకనిపిస్తోంది నీకెవరిదో దిష్టి తగిలి ఉంటుంది అని. నువ్వు చాలా కష్టపడ్డావు. నలుగురు ఆడాళ్ళు కలిసి చేసే పనిని నువ్వు ఒక్కత్తివే నిభాయించు కొచ్చావు. కాని నీకో మాట చెప్పాలి. ఎంత కష్టపడి పని చేసినా ఎవరూ మెచ్చి మేకతోలు కప్పరు. అంతా మేసిపోయే వాళ్ళే. నువ్వు మాడుదాన్ గుహకు వెళ్ళి దిష్టి తీయించుకునిరా. నిమిషంలో బాగా అవుతుంది. మాపిల్ల దానికి ఒకప్పుడు కళ్ళు జబ్బు చేశాయి. అప్పుడు ఎవరో అన్నారు పిల్లదానికి దిష్టి తగిలిందని. నాలుగుసార్లు వెళ్ళి దిష్టి తీయించాను. అంతే కళ్ళు పుచ్చ పువ్వుల్లా బాగుపడిపోయాయి. డాక్టరుగారి మందు కూడ తెచ్చామనుకో. కాని పిల్లదాని కళ్ళు బాగుపడటం మాత్రం బాబా మంత్ర మహిమ వలనేనని నా నమ్మకం."

"దానంతట అదే తగ్గిపోతుంది. ఇంతలో నాకేం ముంచుకొస్తుంది." అంటూ భానో బచని దొడ్డిలో ఉన్న చేతిపంపు తో నీళ్ళు తోడుకుని కడుపునిండా తాగింది.

"గ్లాసుతో తాగు" అంది బచని.

"అబ్బే అక్కరలేదు" అంది భానో. మోచేతులు దాకా నీరుకారి తడిసిపోయిన చొక్కాచేతులను పిండుకుంటూ భానో ఇంటికి వెళ్ళింది.

ఇంటికి రాగానే ముసుగుతీసి చిలకకొయ్యకి తగిలించింది. పెట్టె కింద చెప్పులు విడిచింది. దాకలో నుంచి పప్పు తీసి రొట్టెలు చేసింది. పప్పు చేసింది.

ఇంతలో గుండెలు పిండినట్లయింది. చిన్న గిన్నెలో కొంచెం పప్పేసుకుని రొట్టె తినడం మొదలెట్టింది.

ఈవేళ ఎందుకోగాని రొట్టె ఎంత ప్రయత్నించినా మింగుడు పడటంలేదు. గొంతుక లోనే అడ్డంగా ఉండిపోతూంది. అతి కష్టమీద సగం రొట్టె తిని మిగతా రొట్టెలని కుక్కకి పడేసి చెయ్యి కడుక్కుంది.

ఇంతలో ఏం జ్ఞాపకమొచ్చిందో ఏమో ఉలవలు తెచ్చి తిరగలిలో విసరడం మొదలెట్టింది. ఇలాంటి పని భానో ముందు ఎన్నడూ చెయ్యలేదు.

"ఇప్పుడెందుకు ఈ పని అలా వదిలేయ్‌దాన్ని. ఆనక నేను మరపెట్టిస్తాను" అన్నాడు నారాయణ్.

తిరగలి మోతలో భానోకు ఆ మాటలు వినపడలేదో లేక విన్నా వినిపించుకోనట్టే విసరడం మొదలెట్టింది.

"భానో ఇవేళ నీకేమొచ్చింది" అంటూ నారాయణ్ తిరగలి పిడి పట్టుకుని ఆపు చేశాడు.

"బాగా ఒళ్ళు బిగపట్టినట్టుంది. కొంచెం మందగించినట్టుంది. చెమట పడితే అంతా సర్దుకుంటుదనుకున్నాను" అంది భానో.

"సొంత వైద్యం కూడానా. జ్వరం ఒంటిని పెట్టుకుని తిరగలి విసురుతోందండి. చూడు ఆ మొహం ఎలా ఉందో. ప్రేతకళ పడినట్లుగా ఉంది." అన్నాడు నారాయణ్ దానిని పీటమీద నుంచి లేవదీస్తూ.

"నాకు అలాఏం కాదు. నాలాంటి వాళ్ళు ఆ భగవంతుడికి కూడ అక్కరలేదు."

"అవసరం లేదూ అదేమిటి అలా అంటావు. నువ్వు లేకపోతే నేను ఒట్టి సన్యాసిని అయిపోతాను. అన్నా లేదు. తల్లీ లేదు. తండ్రీ లేదు. ఎవ్వరూ లేరు నాకు. నువ్వేమో ఆ మంచం మీద అలా ముసుగెట్టి పడుకో నేను పెద్దమంగలి దగ్గిరకి వెళ్ళి మందు పట్టుకొస్తాను. చేదుగా టీ కాస్త మరగ కాచి

తాగు. క్షణంలో తేరుకుంటావు. అంతా బాగా అయిపోతుంది" అంటూ నారాయణ్ బయటికి నడిచాడు.

"గాజులు వేయించుకోండి గాజులు" అంటూ బయట వీధిలో గాజులబత్తుడి కేక వినిపించింది.

"భానో ఇంట్లోనుంచి బయటికొచ్చింది. గాజులబత్తుడిని పిలిచింది. చాలాసేపు గాజుల్ని బేరం చేసింది. ఇంతలో ఏం తట్టిందో ఏమో లేచి నిలబడి, వద్దులే బ్రతికుంటే మరెప్పుడైనా చూసుకుందాము" అంది.

వాడు ఏదో చెప్పబోతున్నాడు వినకుండానే ఇంట్లోకి వెళ్ళి తలుపేసేసుకుంది. గాజులు వాడు నణుక్కుంటూ గాజుల పెట్లాలు సర్దుకున్నాడు. మలారం అంతా మూటకట్టి గాజులు వేయించుకోండొహో అంటూ ముందుకు సాగిపోయాడు.

తెల్లార పొద్దుగూకిన తరువాత రోజులన్నీ ఒక్కలా గడుస్తున్నాయి. ఒకరోజుకీ ఒకరోజుకీ మధ్య రాత్రి దొర్లిపోతూంది. ఈ విధంగా భానో జీవితం తెరపిమెరుపులా గడుస్తోంది.

భానో ఎక్కడ కూర్చుంటే అక్కడ అలాగే మాటమంతీ లేకుండ చతికిలబడి ఉంటుంది.

ఎటు చూస్తుంటే అటే అదే దృష్టితో ఉంటోంది.

గురుద్వారాకు రోజు రెండుసార్లు వెళుతూంది.

కూర్చుని బాణీ వింటూంది.

వినీవిననట్టుగా ఉంటుంది. కొంత వింటూంది. కొంత వినటం లేదు.

ఒకరోజున పాఠం గురుగ్రంథ్ ముగిస్తూ పాఠకుడు ఆమెకేసి చూశాడు. గురుద్వారా పెరడంతా తుడిచి శుభ్రం చేస్తూ భానో ఏదో పాడుకుంటోంది.

గురుగ్రంథ్ సాహెబ్‌ను యథాస్థానంలో పదిలపరచి పూజారి తన మకాముకు తిరిగి వచ్చాడు. భానో తన పని తాను చేసుకుంటూ అతని రాకను గమనించలేదు.

పెరడు తుడిచేసి గది తుడవడానికి వెళ్ళింది. అక్కడ ఆ పూజారిని చూసి గిరుక్కున వెనుతిరిగింది. అది చూసి కేకేసి చెప్పాడు. "ఇది కూడా కాస్త తుడిచిపో" అంటూ ఓ చిన్న పుస్తకం తీసుకుని మంచం మీద కూర్చున్నాడు.

దుమ్మెగరకుండా భానో ఆ గదిని నెమ్మదిగా తుడుస్తోంది. తుడిచేసి చీపురు బయట పడేసింది. నూతి దగ్గరికి వెళ్ళి చేతులు కడుక్కుంది.

"ప్రసాదం తీసుకుపో" అని కేక వేశాడు పూజారి.

"భానో తిరిగి వచ్చింది. గురుద్వారా అంటే నీకు అభిమానం ఎక్కువ లాగుందే."

భానో ఏమీ మాట్లాడలేదు.

"ఈ ప్రపంచం నుంచి వెంటతీసుకుని పోయేది ఏముంది" అన్నాడు భాయిజీ గురుబాణీ గ్రంథానికి పట్టు రుమాలుతో చుట్టుబెడుతూ.

"నువ్వు నారాయణ అమ్మీ ఇంటిలో ఉంటున్నావు కదూ?"

"అవునండి."

"పిల్లలా."

"లేరండి."

"శుభ్రంగా సేవచేస్తూ ఉండు. దేవుడు దయ కలగచ్చు."

భానో ఏమీ మాట్లాడలేదు.

"నేను నీకు ఒక బాణీ చెపుతాను. రోజూ 101 సార్లు వల్లిస్తూ ఉండు. మనస్సులో ఉండే కోరికలన్నీ ఫలిస్తాయి. రాసిపెట్టనా?"

"అయ్యో నాకు చదువు రాదు. అంచేత ఆ చేప్పేదేదో నాకు నోటికి వచ్చేటట్టు భోదించండి."

"అయితే విను" 'అంతర్ ఝూనీ పురుక్ విధాతే సరధా మన్‌కీ పూరే.'

"అంతర్ ఝూనీ పురుక్ విధాతే సరధా మన్‌కీ పూరే"

"అయిదు సార్లు అను."

భానో అయిదు సార్లు అంది.

"అంతర్ ఝూనీ పురుక్ విధాతే సరధా మన్‌కీ పూరే."

"సరే ఇంద ప్రసాదం తీసుకో." పూజారి లలాటం తాకించి బాణీ పుస్తకాన్ని బల్లమీద పెట్టి సంచిలోంచి గుప్పెడు ప్రసాదం తీసి భానోకేసి చాచాడు.

భానో దోసిలి పట్టింది.

భాయిజీ తనచేతిలో వున్న దాన్ని ఆమె దోసిలిలో వేస్తూ చేయిపట్టుకున్నాడు.

"గురుదక్షిణ ఇయ్యవా" అన్నాడు పూజారి తన బగిర గడ్డం బుగురు మీసాల మధ్యనుంచి నవ్వుతూ.

భానో అచేతనంగా ఉండిపోయింది.

చెయ్యి విదిలించుకుంటే ప్రసాదం పడిపోతుంది.

బైట ఏదో చప్పుడయింది.

"నేను నిన్ను పరీక్షిస్తున్నాను. గురువుగారి ఇంటిసేవను మాత్రం వదిలిపెట్టకు. ఈ జగత్తు నుంచి మనవెంట తీసుకుని పోయేది ఏముంది కనుక" అన్నాడు గబగబా వెళ్ళిపోతున్న భానో నుద్దేశించి వెనక నుంచి.

భానో తిరిగి చూడకుండానే వచ్చేసింది.

"సతనాం వాహెగురు" అన్నాడు బిగ్గరగా వెనకనుంచి పూజారి.

ఇంటికి తిరిగి వెళుతున్న భానో కాలిలో పెద్దముల్లు గుచ్చుకుంది. ఆ ముల్లు బయటికి పీకినప్పుడు నెత్తురు పైకి చిమ్మింది.

ఓణీ చెంగు నుంచి చిన్న ముక్క చించి భానో కాలుకి కట్టు కట్టుకుంది. కుంటుకుంటూ కుంటుకుంటూ ఇంటికొచ్చింది.

ఇంటికొచ్చి పప్పు చేసింది. రొట్టెలు చేసింది. నేలంతా తుడిచి శుభ్రం చేసింది.

అది దాకలోంచి పప్పు తీసి వినురుదామనుకుంటుండగా ఒళ్ళు సలసలా కాలుతున్నట్లు అనిపించింది.

ఆ రోజున నారాయణ్ రొట్టె తినడానికి కూర్చున్నవాడల్లా పళ్ళెం నేలకేసి విసిరి కొట్టాడు. "ఈ పప్పు ఉప్పు కషాయంలా చేసావేమిటి" అన్నాడు కోపంగా.

భానో కొంచెం పప్పు తీసి నోట్లో వేసుకుని చూసింది. నిజంగానే ఉప్పు ఎక్కువగా ఉంది.

"జ్ఞాపకం లేదు. మళ్ళీ మళ్ళీ వేసానేమో పొరపాటున" అనుకుంది తనలోతాను, నారాయణ్‌కు వినపడీ వినపడనట్లుగా.

"కావాలంటే పంచదారలో నెయ్యివేసి ఇవ్వనా" అని అడిగింది భానో.

"తీపి తింటే నాచిగుళ్ళు మళ్ళీ ఉబ్బుతాయి తెలుసా" అన్నాడు నారాయణ్ మళ్ళీ కోపంగా.

"సరే సంతి ఇంటినుంచి తెచ్చిపెడతాను" అంటూ భానో చేతిలో గిన్నె పుచ్చుకుని సంతి ఇంటికి వెళ్ళింది.

పాదాభివందనం చేసి "ఏం కూర వండావు" అని అడిగింది భానో నేతిగిన్నె వెచ్చబెడుతున్న సంతిని.

"నేనీవాళ శెనగలు కలిపి విసిరించిన గోధుమపిండితో రొట్టెలు తయారు చేశాను. ఆయనీవాళ బస్తీకి వెళ్ళారు. ఇంక మిగతా పిల్లలికి ఏమేసి పెట్టినా తినేస్తారు. ఉల్లిపాయవేసి పెట్టినా తింటారు. చెయ్యడానికి ఏముంది ఇంటిలో. చేస్తే శెనగలు చేయాలి లేకపోతే గుమ్మడికాయ కూర వండాలి."

"ఇవేళ మా ఇంట్లో నేను పప్పు వండాను కాని దాంట్లో కాస్త ఉప్పు ఎక్కువయింది. ఆయన తినడానికి కష్టపడుతున్నారు. అందుకని మీ ఇంట్లో కూర ఏమైనా ఉందేమో కాస్త అడిగి పట్టుకెళదామనుకున్నాను."

"కూర్చో."

"వస్తానమ్మా" అంటూ వట్టి గిన్నెతో ఇంటికి వచ్చేసింది.

ఇంతలో నారాయణ్ అప్పి కుంపటి మీద టీకోసం నీళ్ళు పడేశాడు.

"సరే అయితే ఆ టీ నీళ్ళలో ముంచుకుని తినేస్తాను. అదే కొంచెం ఘాటుగా తయారుచేయి" అంటూ పొయ్యి దగ్గర నుంచి లేచి వచ్చేశాడు.

నీళ్ళు మరిగిన తరువాత సగానికి సగం పాలుపోసి టీ తయారు చేసింది. పాపం ఎంత దురదృష్టం. చూస్తుండగా పొంగుతూ పొంగుతూ ఉండగా వేడిగిన్నె చెయ్యి జారి కిందపడింది. మరుగుతున్న టీ భానో కాళ్ళమీద ఒలికిపోయింది.

నారాయణ్ ఒక్క అంగలో ముందుకు దూకి దాని నడ్డిమీద రెండు గుద్దులు గుద్దాడు. ముక్కుపుటాలు ఎగరేస్తూ రొప్పుకుంటూ అరిచాడు."ఈ పింజారి ముండకి ధ్యాస ఇక్కడ లేదు. ఎక్కడ చచ్చిందో ఏమో. ఈ టీ అంతా ఇలా ఒలకబోసుకోవడానికేనా ఇంత కష్టపడి కాచింది."

వేడినీళ్ళు పడి మండిపోతున్న కాళ్ళమీద చల్లగా ఉంటుందేమోనన్న ఆశతో చన్నీళ్ళు గుమ్మరించుకుంది. కాని కాళ్ళమంట చల్లారలేదు సరికదా ఇంకా బాగా ఎక్కువయింది.

# 8

ఆకురాలు కాలం వచ్చింది.

వేడిగాల్పులు వీచడం మొదలయ్యాయి. పొడిగాలి రివ్వున కొడుతోంది.

వేళాపాళ లేకుండా సుడిగాలి తిరుగుతోంది.

ఎండ చిరచిరలాడుతుంది.

గోడవార పరచిన దుప్పటిమీద దూది చలికాలం నుంచి అలాగే పడిఉంది ఆ దూదిని అలాగే పడిఉన్న పత్తిని విడదీస్తూ భానో అలసిసొలసి వుంది.

"భానో ఈ సమయంలో ఇలాంటి పని ఎవరు చేస్తారు" అని అడిగింది బచని గోడవతల నుంచి.

" గేదెల కోసం పత్తివిత్తులు కావలసి వచ్చింది అందుకని" అంది భానో మంచినీళ్ళు తాగటానికి లేస్తూ.

" వచ్చినప్పటికంటే ఇప్పుడు నీ గేదెలే నవనవలాడుతూ చియ్యపెట్టి ఉన్నాయి." అంది బచని గోడమీద బట్టలు ఆరవేస్తూ.

"నాలుగేళ్ళలో ఎవరు ఎలా ఉంటారో ఎవరికి తెలుసు బచని."

"కాలం చూస్తుండగానే గడచిపోతుంది. కన్నుమూసి తెరిచేంతలో అయిపోతుంది. మా ముసలిది పోయి అప్పుడే నాలుగేళ్ల అయింది. నిన్నామొన్న పోయినట్టుగా ఉంది. లొడలొడ వాగుతూ అక్కడికి ఇక్కడికి తిరుగుతూ ఉండేదాన్ని. మనిషి జీవితమంటే ఎంత. నీటిలో బుడగలాంటిది. అయినా అంతా నాదినాది అంటూ తిరుగుతూ ఉంటాడు" అంది భానో చరఖా దగ్గిర కూర్చుంటూ.

"నిజమే ఆ మాట. చావు ఒక్కటే నిజం. మిగతా అంతా అబద్ధం." అంటూ బచని ఆ చేతిలో ఉన్న తడిబట్టలన్నింటిని ఆరవేసి వెళ్ళిపోయింది.

ఇంతలో నారాయణ్ ఎక్కడనుంచో తిరిగి వచ్చాడు. చిలుము గొట్టం

నిండా నింపుకుని భానో పక్కనే చతికిలబడ్డాడు. కొంచెంసేపు పొగపీలుస్తూనే ఉన్నాడు.

చిలుము ఒక్క పక్కగా పెట్టి మూతి తుడుచుకుంటూ అన్నాడు. "భానో అప్పుడప్పుడు కాస్త బట్టలు ఉతుక్కుంటూ ఉండు. మొదటిలో నన్నుచూసి చిరాకుపడుతూ ఉండేదానివి మురికి బట్టలు కట్టుకుంటానని. ఇప్పుడు నాకంటే అధ్వాన్నంగా తయారయింది."

"అలాగా! నాబట్టలు అంత మాసిపోయాయా" అని అడిగింది తన బట్టలకేసి చూసుకుంటూ.

"ఏమిటి అయింది నీకు. ఏదో కొత్తదానిలాగా బెరుకుతూ బెరుకుతూ ఉన్నావేమిటి" అని అడిగాడు.

"అబ్బే అదేంలేదు. అదేంలేదు" అంది భానో పత్తి బాగుచేస్తూ.

"నువ్వయితే నాదగ్గరే ఉన్నావుకాని నీ మనస్సు మాత్రం అక్కడెక్కడో ఉండిపోయింది కాబోలు అనిపిస్తోంది నాకు" అన్నాడు.

"వెనకాల నాకు ఎవరున్నారని" అంది భానో అదోలా అయిపోయి.

"భానో."

"ఎందుకు."

"భానో నీకు నామీదేమైనా కోపమా. అదోలా మాట్లాడుతున్నావేం" అని అడిగాడు.

"అబ్బే అదేంలేదు. నాకెందుకు కోపం" అంది.

కొన్నినిముషాల సేపు ఇద్దరూ మౌనంగా ఉన్నారు. నారాయణ్ లేచి నిలబడ్డాడు. అంతలో ఏమనుకున్నాడో మళ్ళీ వెంటనే చతికిలబడ్డాడు.

ఆకాశంలో అక్కడక్కడ చిరుమబ్బులు కమ్ముకుంటున్నాయి.

"సాయంత్రానికి వర్షం కురుస్తుందేమో తెలియదు" అని నారాయణ్ అన్నాడు. అయితే ఆ అనడం తన కోసం అన్నాడో భానో కోసం అన్నాడో తెలియడం లేదు.

భానో ఏమీ మాట్లాడలేదు:

"భానో."

"వూ."

"మొన్న పెళ్ళిలో హరియూ వచ్చాడు కదూ."

"అవును వచ్చాడు" అంది భానో పత్తి బాగు చేస్తూ.

"వాడికో మరదలుంది."

భానో దేవుడు సాక్షిగా చెప్తున్నాను. గంగా జలం పట్టుకుని ప్రమాణం చేస్తాను. జీవితాంతం నిన్ను వదిలిపెట్టనని . చూడు ఈ ఇంటికి నువ్వే యజమానురాలివి. కావాలంటే వేలిముద్ర వేసి చెప్తాను. మనకి వృద్ధాప్యంలో కాసిని గంజినీళ్ళు పోసి కాపాడేవాళ్ళు కావాలి కదా. ఇంతకీ ఒక బిడ్డ ఉంటే బాగుంటుంది కదూ. అప్పుడు నేను అన్నాను కదా. ఇంతకీ భానో ఒప్పుకున్నప్పటి మాటకదా అప్పుడు ఆలోచించవచ్చు అన్నాను."

భానో జవాబు ఏమీ చెప్పలేదు.

గోళ్ళతో చేతి కంటుకున్న దూది పోచలని ఒకటి ఒకటిగా తీసుకుంటూంది.

"భానో నాకేమో వయస్సు చెల్లిపోయింది. ఈ పరిస్థితులలో నువ్వు నాదగ్గరకి వచ్చి ఈ మోహజాలంలోకి ఈడ్చావు."

భానో ఏమీ జవాబు చెప్పలేదు.

"చూడు భానో. ఒక నలుసు కలిగితే మనపేరు ఉండిపోతుంది. నేనీ విషయం ఎప్పుడూ ఆలోచించేవాడినే కాను. ఇప్పుడు నేను గోమాతకు ఒట్టేసి చెప్తున్నాను. ఇకనుంచి ఈ ప్రపంచంలో నీ మాటే చెల్లుతుందని."

ముందుకు సాగిపోతున్న మేఘంలా రెండు నిమిషాలు అలాగే ఉండిపోయారు. ఎక్కడో దూరంగా ఆకాశం ఒక్క ఉరుము ఉరిమింది. రెండు మూడు పెద్దపెద్ద వాన చినుకులు టప్పుటప్పుమని పడ్డాయి కూడ.

"లేద్దామా" అన్నాడు నారాయణ్ భానోకేసి చూస్తూ.

"ఇంకొంచం సేపు వేచి చూద్దాం. బహుశః మబ్బులు చెదిరిపోవచ్చు."

# 9

ఋతువు మారుతోంది.

మళ్ళుతున్న మధ్యాహ్నం.

గాలి పొడిగా ఉంది.

మనస్సు వ్యాకులంగా ఉంది. భానో సంతి దగ్గర కూర్చుంది.

"అమ్మా సంతి ఏం చెప్పమంటావు. రాత్రి ఏం జరిగిందంటే. నేను రొట్టె చేసేసి కూర్చున్నాను.చీకటి బాగా ముసురుకుని ఉంది. ఎవరో వీధిలో కేకేస్తున్నారనిపించింది. వెంటనే లేచి వెలుపలికి వచ్చాను. నన్ను ఎవరో పిలుస్తున్నారు అనిపించింది. కాని తీరావచ్చి చూస్తే ఎవరూలేరు.ఇదేం మాయ నాకు ఎందుకిలా అనిపించింది" అనుకున్నాను.

"అయితే అదంతా నీ భ్రమే కావచ్చు భానో. కాని అలా అనిపించినప్పుడు బయటకి రాకూడదు."

"అది సరే ఆ తరువాత రాత్రి కలలో మా అమ్మ కనిపించింది". 'అమ్మా నీ కోసం వెతికి వెతికి వెతికి వెతికి అలసిపోయాను' అంది.

"కాసిని మంచినీళ్ళు ఇవ్వు. భలే దాహంగా ఉంది" అంది.

"అయితే నువ్వు ఆవిడకి మంచినీళ్ళు ఇచ్చావా" అంది సంతి చేతిలో ఉన్న పచ్చడిబండను కిందపెడుతూ.

"ఎందుకు. ఇంతలో కోడి కూసింది. మెలకువ వచ్చేసింది."

"మంచిపనయింది. చచ్చినవాళ్ళని తినడానికి ఏమైనా పెట్టడం తాగడానికి ఏమయినా ఇవ్వడం అంత మంచిది కాదు."

"మంచో చెడో మా అమ్మని కలలోనైనా చూసి తృప్తిపడ్డాను. మనస్సుకు ఎంతో హాయిగా ఉంది.పాపం ఆవిడ పోయినప్పటినుంచి ఎప్పుడు కనిపించలేదు. ఇదే కనిపించడం."

"ఎక్కడున్నప్పటికి ఆవిడ ఆత్మ నన్ను చూడాలని కొట్టుమిట్టాడవచ్చు. ఏమైనా తల్లి కదా."

"ఇంద తీసుకో. అప్పుడు పురోహితుడికి దానం ఇవ్వడానికి నీ దగ్గఱ పుచ్చుకున్న రూపాయిని తిరిగి ఇచ్చేయడానికే ఇప్పుడు వచ్చాను అంటూ భానో జేబులోనుంచి గుడ్డమూటను తీసివిప్పి ఒకనోటును అందించింది."

"భలేదానివే ఈ రూపాయి ఇవ్వుడే ఇవ్వాలి. లేకపోతే ఎక్కడైనా పారిపోతుందా ఏమిటి" అంది సంతి ఆ రూపాయి పుచ్చుకుంటూ.

"కూర్చో భానో."

"వెళతాను చూడు ఆకాశంలో కారుమబ్బులు ఎలా కమ్ముకుంటున్నాయో. తుఫాను వస్తుందో ఏమో. వెళతామరి ఇంకా తలుపులన్ని మూసుకోవాలి. లేకపోతే దుమ్ము దుమారం నిండిపోతుంది."

"ఇంతకీ దేవుడేం చెయ్యదలుచుకున్నాడో ఏమో. అకాలంలో వచ్చే ఈ తుఫానుల వలన పంటంతా ధ్వంసం అయిపోతుంది."

"అంతా ఆ దేవుడి దయ" అంటూ భానో అక్కడనుంచి బయలు దేరింది.

నిజంగానే కారుమబ్బులతో తుఫాను వస్తుంది. ముందుగా గాలిబాటుకి భూమిమీద ఉన్న చెత్తచెదారం పండుటాకులు తేలిపోవడం మొదలెట్టాయి. అంతలో కిటికీలు, గుమ్మాలు తలుపులు కొట్టుకోసాగాయి. చీకట్లు కమ్ముకున్నాయి. కన్ను పొడుచుకున్నా ఏమీ కనపడలేదు. ఫెళఫెళమంటూ చెట్ల కొమ్మలు విరిగిపడుతున్నాయి. నూతి మీద గిలక విరిగి పడింది. దారిన వెళ్ళేవాళ్ళంతా ఏచెట్టు కిందైనా తలదాచుకోవడానికి పరిగెత్తారు. పక్షులన్నీ భయంతో అరుస్తున్నాయి.మునలివాళ్ళు ఇంట్లో కూర్చుని రామస్మరణం చేస్తున్నారు. ఇందతా పిల్లలకు ఏదో తమాషాగానో ఆటగానో ఉంది.

భానో మిద్దెమీద ఉన్న గోలెం మీద మూత పెట్టింది. అలా మూసేసి జాగ్రత్తగా అడుగులేసుకుంటూ దొడ్డి గుమ్మం దగ్గరికి వచ్చేసరికి కళ్ళు తిరిగి దబుక్కున కిందపడింది.

పడీపడగానే మళ్ళీ లేచికూర్చుంది. కాని మళ్ళీ కూర్చోలేక పడిపోయింది.

"అరె చూడమ్మా. భానో పడిపోయినట్టుంది" అని సంతిని పిలుస్తూ బచని తను వెళ్ళి లేవదీసింది.

సంతి పరిగెత్తుకొచ్చింది. ఇద్దరూ ఎలాగయితేనేం సాయంపెట్టి లేవదీసి మంచం మీద పడుకోబెట్టారు. తలనుంచి నెత్తురు కారుతోంది.

చూస్తుండగా అప్పటికప్పుడే ఆ వీధిలో వాళ్ళంతా పోగు అయ్యారు.

సంతి పమిట కొంగు చింపి గాయం మీద దూదివేసి గట్టిగా కట్టుకట్టింది. కాని క్షణంలో ఆ కట్టంతా రక్తంతో తడిసిపోయింది.

బయట నుంచి నారాయణ్‌ను పిలుచుకొచ్చారు. వెంటనే వాడు వైద్యుణ్ణి పిలుచుకురమ్మని భక్తూనూ తరిమాడు.

ఇంతలో పాలలో నెయ్యి వేసి భానోకు పట్టించారు.

కాని, భానో ఉలుకు పలుకూ లేకుండా పడి వుంది.

వైద్యుడు వచ్చే సరికే భానో తలకు కట్టిన కట్టంతా నెత్తురుతో అలా తడుస్తూనే ఉంది.

"ఆ గోలెం మీద మూతెట్టడానికి కోసం పైకెళ్ళి ఉంటుంది." అంది సంతి చల్లబడిన చేతులను రాస్తూ.

"అయ్యా కావాలంటే నా దగ్గర ఉన్నదంతా తీసుకునైనా భానోని ఎలాగైనా కాపాడండి అన్నాడు." నారాయణ్ చేతులు జోడించి వైద్యుడితో.

బలం కోసమని వైద్యుడు ఆవిడకు సూదిమందు ఎక్కించాడు. కొంచం సేపటికి భానోకి స్పృహ వచ్చింది. కళ్ళు తెరిచి చుట్టూ ఉన్న జనం కేసి కలయచూసింది.

"కొంచెం మంచినీళ్ళు" అని అడిగింది సంతి చేతులను గట్టిగా పట్టుకుని.

ఓ చిన్న చెంచానిండా నీళ్ళు తీసి సంతి భానో నోట్లో పోసింది.

తరువాత ఆమె చూపు నారాయణ్ వైపు మళ్ళింది.

"వాహెగురు వాహెగురు" అంది భానో ఆయాసపడుతూ.

మళ్ళీ బలం కోసం డాక్టరు ఇంకో ఇంజక్షను ఇచ్చి "ఇంక ఈవిడని వెంటనే హాస్పటల్‌కి తీసికెళ్ళండి" అన్నాడు.

ఎద్దుల బండిలో హాస్పటల్‌కు తీసుకెళ్ళారు. అక్కడ గాయానికి

కుట్లుకుట్టి కట్టుకట్టారు. ఇంక ఎక్కడైనా దెబ్బలు తగిలాయేమోనని కాళ్ళూ చేతులు తడిమి తడిమి చూశారు. మందు ఇచ్చి వార్డులో పడుకోబెట్టారు.

అలా ఆరు వారాలు ఆసుపత్రిలో భానో పడి ఉంది. ప్రతిరోజూ నారాయణ్ ఊరినుంచి భానో కోసం రొట్టెలు, పాలు, టీ అన్నీ తీసుకుని వచ్చేవాడు.

"మీరు రోజూరోజూకి కష్టపడకండి. కాస్త విశ్రాంతి తీసుకుంటూ ఉండండి. ఇక్కడే ఏదో దుకాణం నుంచి కావలిస్తే టీ అవీ తెప్పించుకుంటాను" అనేది భానో.

"అబ్బే అదేమిటి నేనేం కష్టపడుతున్నాను."

"వంట చేయడం మీకు చాలా ఇబ్బందిగానే ఉండి ఉంటుందే" అంది భానో బాధగా.

"అబ్బేలేదు లేదు. అదేంలేదు " అన్నాడు నారాయణ మెల్లిగా ఇంక వెళ్ళడానికి లేన్సా. ఒకరోజున వంతి భానోని చూడటానికి ఆసుపత్రికి వచ్చింది. ఆవిడేదో చెప్పబోయి మానేసినట్టనిపించింది భానోకి.

ఆరువారాలు తరువాత అక్కడనుంచి విడుదలయి ఇంటికి రాగా హరియా మరదలు వంటింట్లో రొట్టెలు చేస్తున్నట్లు భానో గమనించింది.

భానో ఆ వట్టి మంచం మీద అలాగే పడుకుంది.

"టీ పెట్టనా" అంది భాగవంతి నారాయణ్‌తో.

"తాగుతావా" అని అడిగాడు నారాయణ్ భానోని.

"అక్కరలేదు" అంది భానో.

కొన్ని నిముషాల సేపు ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

అంతట భానో లేచి మంచినీళ్ళు తాగుదామని పీటమీద ఉన్న గ్లాసు తీసుకుంది.

"నేను ఇచ్చేదాన్నిగా" అంటూ భాగవంతి ఆమె చేతిలో గ్లాసు తీసుకుంది. బచని వాళ్ళ దొడ్డిలో ఉన్న పంపునుంచి నీళ్ళు తెద్దామని వెళ్ళింది.

భానో నారాయణ్ వైపు చూసింది. నారాయణ్ కళ్ళు దించుకున్నాడు.

గ్లాసుతో నీళ్ళు పట్టుకుని భాగవంతి హడావుడిగా తిరిగివచ్చింది.

"ఇక్కడ కూర్చుని ఏమి చేస్తారు. అలా బయటకి దుకాణం దాకా వెళ్ళి

కాస్త సబ్బు ముక్క తెచ్చిపెట్టండి" అంది భాగవంతి నారాయణ్‌తో, భానోకు గ్లాసు అందిస్తూ.

మారుమాట్లాడకుండా నారాయణ్ సబ్బు తేవడానికని వెంటనే లేచి దుకాణం వైపు వెళ్ళాడు.

"ఇదిగో.ఆ తెచ్చేదేదో మంచి సువాసన ఉండే సబ్బు తీసుకురండి" అంది భాగవంతి వెనక నుంచి నారాయణ్‌కు వినపడేటట్లుగా.

"మిద్దెమీద నా బట్టలు ఉన్నట్లున్నాయి. కాస్త తెచ్చి పెట్టు" అంది భానోతన మాసిపోయిన బట్టలవైపు చూసుకుంటూ.

"అవి చిరిగి పోయాయి. గ్రహణం రోజున బిచ్చగాళ్ళకి అవి నేను దానం చేసేశాను. అయితే నువ్వు నా బట్టలేమైనా కట్టుకుని నీ బట్టలు ఉతుక్కో" అంటూ భాగవంతి కర్రతో వాసానికి కట్టిన పిచ్చుక గూడును పడదోసింది.

"ఇదొకటి రోజూ చెత్తచేర్చి పెడుతుంటాయి."

"జాగ్రత్త. వాటిలో గుడ్లేమన్నా పెట్టాయేమో" అంది భానో.

"ఒకవేళ ఉన్నా అవి పిచ్చుక గుడ్లేకానీ నీవి కాదుకదా" అంది వేళాకోళంగా భాగవంతి.

భానోకి జవాబు తట్టలేదు.

"పీట కొత్తది చేయించారా" అంది భానో దానికేసి చూస్తూ.

నారాయణ్ రెండు సబ్బుబిళ్ళలు తెచ్చాడు. అందులో ఒకటి భాగవంతికి ఇచ్చాడు. రెండోది భానో పక్కన పెట్టాడు.

"వెళ్ళు వెళ్ళు, వెళ్ళు" అని కసిరింది భాగవంతి గుమ్మంలో నుంచి లోపలికి రాబోతున్న కుక్కల్ని చూసి. వాటి మీదకి ఒక కర్ర విసిరింది. కట్టెదెబ్బ తగలడంతో కుక్క తిరుగుమొహం పట్టింది. రెండు అడుగులు వెళ్ళినట్లే వెళ్ళి మళ్ళీ లోపలికి వచ్చింది. మళ్ళీ లోపలికి వచ్చి గుమ్మం దగ్గర నిలబడింది.

కుక్క మళ్ళీ రావటం చూసి భాగవంతి తరుముకుందుకు లేచి పప్పు తెడ్డుతో దాని నడ్డిమీద రెండిట్టింది అది కుయ్యోమొయ్యో అంటూ కుంటుకుంటూ పారిపోయింది.

"పాపం దాన్ని కొడతావెందుకు. కుక్కల మొఆ భగవంతుడు కూడ

ఆలకిస్తాడు అంటారు" అంది భానో ఒణుకుతున్న చేతుల్ని పమిట కొంగులో దాచుకుంటూ.

భాగవంతి ఏమీ మాట్లాడలేదు.

"కుక్కననే ఏమిటి. దాన్ని కొడితే కొట్టావుగాని ఏదో రోజుని నన్ను కూడ కొంపదీసి అలా తరిమేయురు కదా. ఇప్పుడు మీరు ఒక్కళ్ళకి ఇద్దరయ్యారు కూడాను" అన్నాడు నారాయణ్ పరిహాసంగా.

"అలాంటి ఆచారం మీ దేశంలో ఉందేమోగాని మాకు లేదు" అంది భాగవంతి నారాయణ్ చేతికి టీ గ్లాసు అందిస్తూ.

"భానోకు కూడ ఇయ్యి."

"దానికి అక్కరలేకపోయినా బలవంతంగా ఇమ్మంటారా ఏమిటి."

"అవసరం లేకపోవడం ఏమిటి పాపం అలసిసొలసి వచ్చింది కదా."

"సరే అవసరం ఉందో లేదో దానికన్నా మీకే ఎక్కువ తెలిసినట్టుందే. దానికి తాగాలని లేదేమో."

"ఇంద టీ తాగు" అంటూ నారాయణ్ తన చేతిలో ఉన్న గ్లాసును భానోకు అందిస్తూ.

"అసలు సంగతి ఏమిటంటే భానోకి నీ దగ్గిర టీ తాగాలనిపించిందన్నమాట" అని నవ్వుతూ అంది భాగవంతి నారాయణ్‌కు మరొక గ్లాసు అందిస్తూ.

"పాపం పిచ్చిది. పతిదేవుని ఆజ్ఞ పాలిస్తుంది."

"ఇంతోటి పతిదేవుని గురించి ఏం చెప్పేది" అంది భాగవంతి వెటకారంగా చెయ్యి ఊపుతూ.

"కాకపోతే దేవుడికి మహాకొమ్ములు మొలుచుకొచ్చాయి." అన్నాడు నారాయణ్ కనీసం మాటల్లోనైనా భాగవంతిని గెలవనీయకూడదని.

"సరే సరే. అయ్యో భానో పతిదేవుడు గారు మీరు దయచేసి వెంటనే చెప్పులు కుట్టే మోదో ఇంటికెళ్ళి వాడు నాకోసం కుట్టివుంచిన కొత్త చెప్పులు జత కాస్త తెచ్చి పెడతారూ. చాలా రోజులయింది వాడు కొలత తీసికెళ్ళి. ఇప్పుడే చెప్పుల జత పూర్తిగా తెగిపోయింది. ఇవాళ నేను ఒట్టికాళ్లతోటే బయటకు తిరగాల్సి వచ్చింది."

"మోదు ఇంకా పట్టుకొచ్చి ఇవ్వలేదా?"

"ఎక్కడిచ్చాడు."

"సరే కనుక్కుంటాను" అని నారాయణ్ లేచి వెళూతూ వెళూతూ భానో మొహంలోకి చూస్తూ అన్నాడు.

"భానో నువ్వు కూడా నీ పాదాలు కొలత తీసేయ్. పనిలో పనిగా వాడికి చెప్పి ఇచ్చి వస్తాను. లేకపోతే నువ్వు మళ్ళీ వెళ్ళమంటావు రేపు."

"వద్దండి అక్కరలేదు. నాజోడు ఇంకా బాగానే ఉంది" అంది భానో వెడుతున్న నారాయణ్ కేసి అదే పనిగా చాలాసేపు చూస్తూ.

భాగవంతి ఒకటిరెండుసార్లు ఆవిడకేసి చూసింది. కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దంగా ఉంది.

"నీ మంచం అలా సావిట్లో వెయ్యమంటావా అక్కడ గాలి బాగా వస్తుంది."

"అలాగే అక్కడే పెట్టేయ్" అంది భానో అనాలోచితంగా.

అక్కడ చావడిలో మంచం మీద పడుకుని ఉన్న భానోకి రాత్రి పొద్దుపోయే వరకు భాగవంతి నారాయణ్‌ల గుసగుసలు పకపకలూ వినిపిస్తూనే ఉన్నాయి.

# 10

వేసవికాలం వెళ్ళిపోయింది.

చలికాలం వచ్చింది.

చలికాలం కూడా వెళ్ళిపోతుంది.

నారాయణ్ లోపలికి వచ్చాడు. భానో బయటికి వెళ్ళబోతోంది.

"భానో ఎక్కడికెళుతున్నావు" నారాయణ్ కొంచెం గద్దింపుగా.

"పర్తాపీ ఇంట్లో ముసలోడు పోయాడు కదా అందుకని వాళ్ళింటికి వెళుతున్నాను. కాసేపు కూర్చుని వచ్చేద్దామని."

"ఏం నువ్వేం గుత్తకు పుచ్చుకున్నావా లేకపోతే ఎవళ్ళింట్లో ఎవళ్ళు పోయినా నువ్వే ఏడవాలా ఏమన్నానా. అవతలివాళ్ళు ఏడ్చినా ఏడవకపోయినా నువ్వు మాత్రం వెళ్ళి తప్పకుండా కళ్ళు తుడుచుకు వస్తావు."

"ఎవళ్ళ కోసం ఎవళ్ళో ఎందుకు ఏడుస్తారు? అందరూ వాళ్ళ వాళ్ళ కోసమే ఏడుస్తారు."

"నాకు అనిపిస్తూ ఉంటుంది కదా. నేను బతికుండగానే నువ్వు ఎందుకు ఏడుస్తున్నావా అని అనుకుంటాను."

"కాస్త సంతోషంగా ఉండే మాటలు చెప్పకూడదూ. ఇప్పుడు ఏమైందని ఇలా కష్టం కలిగించే మాటలు మాట్లాడతారు" అంది భానో ఫిర్యాదు చేస్తున్నట్లుగా.

"ఇంతకీ నేను ఇంటికి వచ్చేసరికల్లా నువ్వు బయటకు ఎందుకు వెళ్ళిపోతున్నావని అడుగుతున్నాను. జవాబు చెప్పు."

"ఎందుకోగాని నా మనసంతా గుబులు గుబులుగా ఉంటోంది. ఇక్కడనుంచి ఎక్కడకైనా పోతే బాగుంటుదని అనిపిస్తూ ఉంటుంది."

"అలాకాదు అసలు సంగతి ఇంటి దగ్గర ఉన్నట్లయితే ఏదైనా పని చేయవలసి వస్తుందని. చిన్నదో పెద్దదో చెయ్యక తప్పదు. లేకపోతే నామీద కక్ష అయినా కావచ్చు. నేను వచ్చానని కోపం కాబోలు. ఇక్కడ నా పరిస్థితి ఏమిటి? అయినా నేను ఎలా ఉన్నా ఇంటి పనంతా నేను ఒక్కత్తినే చెయ్యాల్సి వస్తుంది" అంది భాగవంతి లోపలి నుంచి కసువూడ్చి వీధిలో పారబోస్తూ.

"భానో నువ్వు ఏమిటి కొత్తగా వచ్చిన చుట్టంలా వుంటున్నావు. ఇది వరకు నువ్వు నీ చేతులతో ఈ ఇంట్లో పనంతా చేసుకునే దానివే కదా. ఇప్పుడు ఏమొచ్చిందే నీకు ఇలా తయారయ్యావు" అన్నాడు నారాయణ్ గద్దింపుగా.

"భాగవంతి ఏం చెయ్యమంటే అది చేస్తున్నాను. పేడ పోగుచేసుకొస్తున్నాను. బట్టలు ఉతుకుతున్నాను. అంట్లు తోముతున్నాను. చెయ్యమన్నప్పుడల్లా వంట చేస్తున్నాను" అంది భానో గబగబా వేళ్ళు లెక్కిస్తూ.

భాగవంతి భానోవైపు క్రీగంట చూస్తూ అంది " నేను ప్రపంచానికి బెడిసేం మాట్లాడం లేదు. నువ్వు ఇంట్లో లేనప్పుడు భానో అన్తమానం కూనిరాగాలు తీస్తూ కూర్చుంటుంది. అప్పుడప్పుడు శోకన్నాలు పెడుతూ ఉంటుంది. ఆవిడ ఎప్పుడు ఎందుకు ఎవరి కోసం పాడుతుందో తెలియదు. ఎవరో చచ్చిపోయినట్లు ఎందుకు శోకన్నాలు పెడ్తుందో కూడ తెలియదు. చూడు ఎవరైనా తన ఇంట్లో నూరుశుభాలు కలగాలని కోరుకుంటూ ఉంటారు. మరి ఈవిడో..."

"అవునా?" అన్నాడు నారాయణ్ కోపంగా...భానోకు భయమేసింది. నారాయణ్ కొడతాడేమోనని. సంతి ఇంటివైపు చూసింది.

"దీని ప్రాణానికి ఆ సంతి ఒకతి దొరికింది. అన్తమానం ఆనమ్మా బోనమ్మా కబుర్లు చెప్పుకుంటూ, ఇంటిగుట్టు చెప్పుకోవడానికి కూడ" భాగవంతి చీపురుని గడప దగ్గిర పెడుతూ అంది.

భానో లోపలికి వచ్చి గేదెను కట్టిన చోట చుట్టూ బాగుచేయసాగింది.

"వినండి. నేను మీకు ఇప్పుడు ఉన్నమాట చెప్పేస్తున్నాను. ఇన్నాళ్ళుగా ఓపిక పట్టుకుని వూరుకున్నాను. ఇన్నాళ్ళు దీనికి అన్నీ మప్పితంగా

చేసిపెట్టాను. నన్ను ఎవరూ దబ్బిచ్చి నిలబెట్టలేదు. ఇదేమో రోజంతా కులుకుతూ ఉంటుంది. నేనేమో ఆ కుంపటి ముందు కూర్చుని పొయ్యి వూదుతూ చస్తూ ఉంటాను. ఇకనుంచి కుదరదు. దీనికి వండి వార్చి పొయ్యలేను. దానికి కావలసిన గుప్పెడు గంజి దాన్నే కాచుకోమను. ఇక్కడ నేనెవరికీ నౌకరును కాను" అంది భాగవంతి నారాయణ్‌కు భోజనం పెడుతూ.

"భానో నువ్వు కూడ కాస్త సాయం చేస్తూ ఉండు" అన్నాడు నారాయణ్ భానోతో.

"చెప్పడానికేం అందరూ చెపుతారు. కాని నిజం దేవుడికే తెలుసు. నేనెప్పుడూ ఎందుకు కూడా దీని నోటికి చేతికి అడ్డం రాలేదు. కావాలంటే నువ్వే అడిగి చూడు. నీ ఎదురుగానే కూర్చుందికదా. నేను పొరపాటున ఏమైనా పని చెపితే పాడు చేసేస్తుంది. మొన్నో రోజున నేను అన్నాను కదా భానో కాస్త పొయ్యి దగ్గరుండు. నేను ఒళ్ళు తడుపుకుని వస్తాను అన్నాను. తీరా వచ్చి చూద్దును కదా కుక్క పాలు తాగేస్తూంది. నేను నిన్ను ఇక్కడ ఎందుకు కూర్చోపెట్టినట్లు."

"మరేం లేదు భాగవంతి. ఏరోజునైతే దీనికి తల బద్దలయిందో ఆ రోజునుంచి దీనికి మతి సరిగ్గా ఉండటం లేదు. నువ్వే చూస్తున్నావుగా నువ్వు ఒక రొట్టె ఇస్తే ఒక రొట్టె తిని వూరుకుంటుంది. ఒకవేళ నువ్వేమీ పెట్టవనుకో పెట్టమని అడగదు. పిచ్చిదానిలా పాపం వీధి వెంబడి తిరుగుతూ ఉంటుంది. అకారణంగా ఉన్నట్టుండి ఏడుస్తుంది. ఏమైనా దీన్ని నువ్వు కోపగించుకోకూడదు."

ఇంతలో భానో గేదె చుట్టూరా బాగుచేసి వచ్చి కూర్చొంది. పీట మీద గ్లాసు తీసుకుంది. కుండలో నుంచి నీళ్ళు ముంచుకుని తాగింది.

"ముండా మురికి చేతులు కడుక్కో" అని భాగవంతి కసిరింది.

భానో ఉలిక్కిపడింది. చేతులు కడుక్కోవాలన్న ధ్యాసే లేకుండా పోయింది దానికి.

బచని పంపు దగ్గరికెళ్ళి గిన్నెనిండా నీళ్ళు పట్టి తెచ్చుకుంది. ఆ చేతుల్ని అలా కడుగుతూనే ఉంది. అలా ఎంతసేపు కడిగిందో!

నారాయణ్ భోజనం ముగించాడు. పొగతాగాడు.

ఎండలో కూర్చుని జుట్టు సరిచేసుకుంటున్నాడు.

అప్పటికీ భానో ఇంకా చేతులు కడుక్కుంటూనే ఉంది.

"ఇంక చాల్లే ఆ కడుక్కోవడం" అని కేకేసాడు నారాయణ్.

భానో ఉలిక్కిపడింది. ఇంతసేపు చేతులు కడుక్కుంటున్నాను ఏమిటా అనుకుంది.

ఈ మధ్య కాలంలో భాగవంతికి కొడుకు పుట్టాడు.

"చాలా సంతోషం భానో" అంది సంతి భానో ఇచ్చిన బెల్లం ముక్క తీసుకుంటూ.

"అవును. అంతా ఆ దేవుడి దయ" అంది.

"అయితే ఆ దేవుడు నీ సంగతి మరచి పోయాడు. అయితే అందరూ భక్తుల్నే పట్టుకుంటారు. భాగవంతిలా ఉంటే ఎప్పుడో."

"అది మాత్రం ఎక్కడిది. దాని బిడ్డ నా బిడ్డ కాడా? మా ఇంట్లో చీకట్లు చెదిరిపోయాయి.కులదీపకుడు వెలిశాడు. నేను కూడ ఆ దేవుణ్ణి ఎన్నో విధాలా ప్రార్థించాను. కొడుకుని అనుగ్రహించమని."

"సరేకాని ఈ కొడుకు పుట్టడంతో దానిది పైచేయి అయింది. ఇంటికంతటికి అదే యజమానురాలయింది. ఇంక నీకు ఇక్కడేముంది. నువ్వు ఓ కాయితం ముక్కయినా వ్రాయించుకోలేదు. అది చూడు ఎంత తెలివైనదో. ముందే పంచాయితీలో వేలుముద్ర వేయించుకు వచ్చింది. నిజానికి అదే ఇంటికి యజమానురాలు."

"నాదేముంది. ఏదో విధంగా రోజులు గడిచిపోతే చాలు నాకు. దాన్నే యజమానురాలిగా ఉండనీ."

"అవును తల్లీ వచ్చినందుకు ఎలాగోలాగ గడుపుకుని రోజులు వెళ్ళబుచ్చుకోవాలి కదా. నువ్వు రావడంతోటే ఈ ఇంటి అదృష్టం మారిపోయింది. దీని దశ తిరిగింది."

"కాని ఒకమాట. భాగవంతి మనస్సు అంత చెడ్డది కాదు. మాట తీరే అంత. సరే అయితే నేను కూడా నీకు ఉంగరం చూపించనా" అంటూ భానో ఉన్న బెల్లమంతా ఒకచేతిలో పట్టుకుని రెండో చేయి సంతికేసి చాచింది. కొడుకు పుట్టాడనే సంతోషంలో మీ మరిదిగారు ఇది చేయించి పెట్టారు.ఆయన అన్నాడు కదా భాగవంతి కోసం తాబీసు కూడా తయారు

చేసుకు వస్తానన్నాడు. నేనేం కొత్తదాన్నా అన్నాను."

"ఉంగరం చాలా బాగుంది. బహుశా అరతులం ఉండచ్చు." సంతి చేతిలో ఉంగరాన్ని పట్టుకుని బరువు అంచనా వేస్తూ.

"ఈ మూడేళ్ళలోను బ్యాంకులో ఖాతా ఇరవై వందలతో పాటు మరో పదిహేను వందలు కూడ చేరాయి. మెల్లిమెల్లిగా తాకట్టులో ఉన్న భూమి కూడ విడిపించుకున్నాము. లేకపోతే ఈ బిడ్డను అందరూ ఆడిపోసుకుంటారు."

"ఇప్పుడే పసికందు వేలెడంత లేడు. కాని ఎత్తుకుంటే మనస్సుకు ఎంతో హాయిగా ఉంటుంది."

సంతి భానో మొహంలోకి అలా చాలాసేపు చూస్తూ ఉండిపోయింది.

సంతి చెప్పిన మాట అక్షరాల నిజమయింది. పిల్లాడు పుట్టినప్పటి నుంచి భాగవంతి పూర్తిగా మారిపోయింది. ఇప్పుడు మాటిమాటికి నారాయణ్ మీద కూడ విసుక్కుంటుంది. నారాయణ్ కూడ ఇది వరకు ఏమి అనేవాడుకాడు. ఒకరోజున నీళ్ళు పోస్తుండగా పిల్లాడు చెయిజారి కింద పడ్డాడు. అప్పుడు భాగవంతి పట్టరాని కోపంతో భానోను పట్టుకుని కొట్టింది.

ఒక రోజున ఒకరాత్రి వేళ లేచి కాలా (కుఱ్ఱాడి పేరు) గుక్కపెట్టి ఏడుస్తున్నాడు.

భానో మిద్దెమీద నుంచి పరుగు పరుగున దిగివచ్చింది. కిందకొచ్చే సరికి తలుపు లోపల నుంచి గడియవేసి ఉంది.చొరవచేసి భానో గొళ్ళెం టకటకలాడించి అంది. " భాగవంతీ చూడు కాలా ఎందుకో ఏడుస్తున్నాడు. వాణ్ణి నా చేతికియ్యి వూరుకో పెడతాను."

భాగవంతి లోపలినుంచి కసురుకుంది. "నేను వూరుకోపెట్టుకుంటానులే."

భానో కొంచెంసేపు అక్కడే ఆ గుమ్మం దగ్గరే అలాగే నిలబడి వుంది.

కాలూ మరునాడు కూడ రోజల్లా ఏడుస్తూనే ఉన్నాడు. వీడికి బహుశా దిష్టి తగిలిందేమో అనిపిస్తోంది అంది బచని ఎలుకలు మందు గోధుమ పిండిలో కలుపుతూ.

"ఇంకెవరిది. ఆ భానో పాపిష్టి కళ్ళే పడుంటాయి. నిమిషనిమిషానికి వాడికేసి అలా గుడ్లప్పగించి ఆశగా చూస్తుంటుంది. గొడ్రాలు దృష్టి పిశాచం

దృష్టి ఒకటే అంటారు. అంచేత నువ్వు బాబా దగ్గిరకు వెళ్ళి దిష్టి తీయించుకునిరా."

"బచని నువ్వు భలే తెలివైనదానివి. నువ్వే చెప్పు. ఇప్పుడే పిల్లాడిని ఎత్తుకుని నేను ఏ నూతిలో దిగను. ఎలాగోలాగ నీ పిల్లాడిని ఎత్తుకుని నీ పనంతా నువ్వే చేసుకో. దాన్నింక ఎప్పుడూ ఎత్తుకోనీయకు."

"ఏం చెయ్యమంటావు. ఎత్తుకోనీయకపోతే కూడా, కూడా పడుతుంది. వేళాపాళా లేకుండా ఎత్తుకుంటాననటుంది. వద్దంటే వణుకుక్కుంటూ శాపనార్థాలు పెడుతుంది."

"ఆ మాటా నిజమే. అయితే నరుడి దృష్టికి నాపరాయి కూడ పగులుతుంది.పువ్వులాంటి సుకుమారులు పిల్లలు."

చాలా రోజులు కాలా నలత గానే ఉన్నాడు.

భాగవంతి భానోని అస్తమానం దుమ్మెత్తి పోస్తూనే ఉంది. ఏదో వంకతో ప్రతిసారి నారాయణ్‌ను కూడా ఆడిపోసుకోనేది.

ఇంట్లో ఇంత గొడవ జరుగుతున్నా భానోకు ఏమి తెలినీయలేదు. ఒకటి రెండుసార్లు నారాయణ్‌తో దెబ్బలాడి భాగవంతి ఏడుపు లంఘించుకుంద కూడానూ. ఒకటి రెండుసార్లు నెత్తిమొత్తుకుంది కూడా. నారాయణ్ తనకుతానే తిట్టుకుంటూ బయటికి వెళ్ళిపోయాడు.

ఆరోజున ఇంట్లో ఎవరూ వంట చేయలేదు. ఏమీ తినలేదు.

ఒకరోజున భానో భాగవంతీని అడిగింది, "భాగవంతి వంట చెయ్యనా" అని.

"దీనికెప్పుడూ తిండి గొడవే" అంటూ భాగవంతి విసుక్కుంది.

భానో మాట్లాడకుండా మిద్దెమీదకు వెళ్ళిపోయింది.

పొద్దుగూకే వేళకి నారాయణ్ అక్కడికి వచ్చాడు. వాడిని చూడగానే భానో ఎంతో సంతోషించింది. కానీ అంతలో ఏమనుకుందో ఏమో మొహం ముడుచుకుంది. మనస్సంతా అదోలా అయిపోయింది.

నారాయణ్ వచ్చి ఆమె పక్కనే మంచం మీద కూర్చున్నాడు.

కొంచెం సేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

"భానో!" అన్నాడు నారాయణ్ తన అరచేతిలోని గీతల్ని చూస్తూ.

భానో ఆశ్చర్యంగా అతని మొహంకేసి చూసింది.

"భానో నేను అంతా గమనిస్తూనే ఉన్నాను. భాగవంతి నీకు ఒక రోజున భోజనం ఉంచుతుంది. మరొక రోజున ఉంచదు. నాకు ఆ సంగతి కూడ తెలుసు.నువ్వు ఒక్కొక్కసారి గుక్కెడు మంచినీళ్ళు తాగివడి ఉంటున్నావని."

"ఇంతకీ కాలే కులాసాగా ఉన్నాడా" అని అడిగింది. నారాయణ్ చెప్పేది ఏమిటో వినిపించుకోకుండా.

"అలాంటివాళ్ళతో నీకేం పని, అదేమో నిన్ను కుక్కకంటే హీనంగా చూస్తున్నప్పుడు."

"అదేమో నాకాపిల్లాడంటే తగని ఆపేక్ష. కాని భాగవంతి నన్ను వాడి ఛాయలకే పోనివ్వదు" అంది భానో ఫిర్యాదు చేస్తున్నట్టుగా.

"కాని అదంటుందికదా, 'నేను ఇక్కడనుంచి వెళ్ళిపోతాను. ఒకసారి వెళ్ళిపోయానంటే ఈ కొంపకు ఎప్పుడు తిరిగిరానని' బెదిరిస్తుంది. ఆ పింజారీలు దీన్ని మళ్ళీ డబ్బు కోసం ఇంకెవళ్ళ దగ్గరికో తోలేస్తారు."

"అలా ఎందుకు జరగాలట" అంది భానో ఎంతో ఆశ్చర్యంగా.

"అది నిన్ను ఒకటిరెండుసార్లు చావకొట్టిందటగా సంతి చెప్పిందిలే" అన్నాడు నారాయణ్.

"పోనిద్దూ. కొట్టాలనుకుంది. కొట్టింది."

"భానో నేను బతికుండగానే నీకు ఇన్ని తిప్పలు రావడం చూడలేక పోతున్నాను."

"అది నిజంగానే పిల్లాడిని తీసుకుని పోతానంటుంది. ఈ కొంపలో భానో అయినా ఉండాలి. లేకపోతే నేనయినా ఉండాలి. మా ఇద్దరిలో ఎవరు కావాలో తేల్చుకోమంది."

భానోకు ఈ మాటలేమీ అర్థమయినట్లు లేదు. నారాయణ్‌కేసి అతని మొహంలోకి అలా చూస్తునే ఉంది.

"దానికి ఈ బిడ్డ పుట్టకుండా ఉండినట్లయితే నేను చెప్పేసేవాడిని. నీ ఇష్టమొచ్చిన చోటికి పొమ్మని."

భానో ఏమీ మాట్లాడలేదు.

"భానో చూడు. మనం ఆ మధ్యన గేదెని కొన్నాం చూడు. ఆ చౌందేవాలే పత్తా వాడు చాలా మంచివాడు. వాడికెవ్వరూలేరు. వాడికొక ఎదిగిన కొడుకుండే వాడు. ఆమధ్య వాడు పోయాడు. వాడికి బోలెడంత ఆస్తి ఉంది. నేను వాడితో మాట్లాడాను. భానో ఒప్పుకుంటే సరే అన్నాడు. ఓసారి మనింటికి వచ్చాడు కూడాను. నిన్నూ చూశాడు."

భానోకి నోటమాట రాలేదు.

"భానో ఇందులో నేనేమీ దురాశకు పోలేదు. నీమంచి కోనమే చెపుతున్నాను. ఇక్కడ నీ పరిస్థితి ఏం బాగా లేదు. భాగవంతి నీ జీవితాన్ని దుర్భరం చేసేస్తుంది. ఇంక నిన్నేం లెక్కచేస్తుంది."

భానో ఆలోచనలో పడిపోయింది.

అవునూ అనలేదు. కాదు అనలేదు. గుడ్లు మిటకరిస్తూ మాటిమాటికి నారాయణ్ మొహంలోకి చూస్తోంది.

"వాడు రేపు వస్తాడు. ఏ సంగతి నిన్ను అడిగి చెపుతానన్నాను."

భానోకి మతి పోయినట్లయింది.

"చూడు భానో నువ్వు కాకిచేత కబురంపిస్తే రెక్కలు కట్టుకొచ్చి వాలుతాను. నువ్వేం అంత దూరం వెళుతున్నావని. ఇంతకీ చౌందా ఎంత దూరం. రోజూ స్వయంగా వచ్చి చూసిపోతూనే ఉంటాను. వాడైనా చాలా మంచివాడు. వాడికీ యాభై ఏళ్ళు నిండాయి కదా నిన్నేం ఇబ్బంది పెడతాడు."

భానో ఏమీ జవాబు చెప్పలేదు.

"భానో మననర్సు చిన్నబుచ్చుకోకు. ఈ పిల్లాడంటూ పుట్టకపోయినట్లయితే నేను దాన్ని లెక్కచేసి ఉండేవాణ్ణి కాను. అక్కనువ్వు ఇక్కడకంటే ఎక్కువ సుఖపడతావు. భానో మనిషి చేతుల్లో ఏమీ లేదు. మనకి ఎక్కడ నీళ్ళు నూకలు ఋణం ఉన్నాయో అక్కడ ఏదో వంకన చేరుకోక తప్పదు." అంటూ నారాయణ్ భానో వీపు తట్టి టకటకా మెట్లు దిగిపోయాడు.

# 11

పొద్దు గూకింది.

చీకట్లు కమ్ముకున్నాయి.

రాత్రి గడిచిపోయింది.

తెల్లవారింది.

తాను నిద్రపోతుందో మెలకువగా ఉందో ఏమీ తెలియని స్థితిలో ఉంది భానో.

పేడ పోగుచేయడానికి కూడా కిందకు దిగి రాలేదు. ఆ పని భాగవంతికి కూడా పురమాయించలేదు.

ఇల్లంతా భూకంపం వచ్చినప్పటివలె వూగి పోతున్నట్లనిపించింది. అబ్బే అదేం లేదు. తనకే కళ్ళు తిరుగుతున్నాయనుకుంది.

భానో చూస్తుండగానే పిల్లి అలమార మీదకు ఒక్క దూకు దూకి అక్కడ వాలిన పిచ్చుకను నోటితో కరుచుకుని పారిపోయింది. ఆ పిల్లిని తరమడానికి కూడా ఆవిడకు ఓపిక లేకుండా పోయింది.

"భానో టీ తాగు " అని పిలిచింది భాగవంతి.

భానో మెల్లిమెల్లిగా ఒక్కొక్క మెట్టే ఎక్కి కిందికి దిగి వచ్చింది.

టీతో పాటు ఒక చపాతీ కొంచెం వెన్నముద్ద ఒక పళ్ళెంలో పెట్టి భాగవంతి భానో ముందు పెట్టింది.

భానో రెండు గుక్కలు టీ తాగింది. రొట్టె మాత్రం ఎంత ప్రయత్నించినా గొంతు దిగటం లేదు. అతి కష్టం మీద సగం టీ తాగి మిగతా సగం కుక్కకు పోసేసింది.

కొన్ని నిమిషాలు మౌనంగా పని చేసుకుంటున్న భాగవంతికేసి చూసింది.

"ఇంద తీసుకో ఈ ఉంగరం నావేలికి వదులయిపోయింది" అంది భానో భాగవంతికి తన ఉంగరాన్ని అందిస్తూ.

"నువ్వే ఉంచుకోలేకపోయావా. ఏమో సరేలే. అలాగే దాచిపెడతానులే. నీకు ఎప్పుడు కావాలంటే అప్పుడు అడిగి తీసికెళ్ళు" అంటూ భాగవంతి గుడ్డకు కట్టి పెట్టె అరలో ఒక మూల దాచి పెట్టింది.

మధ్యాహ్నం పత్తా వచ్చాడు.

"మేము అలా నూతివైపు వెళుతున్నాం. నువ్వు కూడా రా భానో" అని చెప్పేసి నారాయణ్ అమ్మీ పత్తాను తీసుకుని వెళ్లాడు.

భానో తాను మోసపోయాను అనుకుంది. కొయ్యబారి పోయింది. అలాగే కూర్చుండి పోయింది.

"రొట్టె చేసి మూటకట్టి ఇవ్వనా కూడా తీసికెళ్ళడానికి " అని అడిగింది భానోని.

"అక్కరలేదు" అంటూ భానో బయటికి నడచింది.

మళ్ళీ తిరిగి లోపలికి వచ్చింది.

అలా వుట్టినే రెండు మూడుసార్లు లోపలికీ బయటకీ తిరిగింది.

"ఏమన్నా కావాలా" అని అడిగింది భాగవంతి.

"అక్కరలేదు."

"అయితే వాళ్ళక్కడ నీకోసం ఎదురు చూస్తుంటారు కాబోలు. వెళ్ళుమరి."

భానో లోపలికి వెళ్ళింది.

దండెం మీదనుంచి లంగా తీసుకుంది. ఏమనుకుందో ఏమో దాన్నిమళ్ళీ ఆ దండెం మీదే వేసేసింది.

పసివాడు కాలా దొడ్లో ఓ మంచం మీద పడుకుని బొటనవేలు చీక్కుంటున్నాడు.

భానో వాడి తలనిమిరి "నేను వెళ్ళిపోతున్నానురా నాయనా" అంది.

వీధిలోకి వెళ్ళిన తరువాత కూడా మళ్ళీ ఓసారి ఇంటివైపు చూసింది.

వంతి ఇంటి గుమ్మం దగ్గర ఒకసారి నిలబడి మళ్ళీ ముందుకు సాగిపోయింది.

లంగా కట్టుకోకుండా నెత్తిమీద మునుగు లేకుండా భానో ఇవాళ పరదేశిలా వెళ్ళిపోతోంది.

---

Laser typesetting by FoturnePublishers, 59/9 Kalkaji New Delhi and printed at
The Central E lectric Press, Narina Phase I, New Delhi-110 0 28